ర్ద్రఢా తథా। కర్తవ్యా వేదికా శ్రేష్ఠా తదభావే మృదాపివా ॥ దర్పణోదరసంకాశా నిమ్నోన్నతవివర్జితా ॥

తా॥ దేవాలయమునకు ముందుభాగమునందు ముఖాగారమంటపము కట్టవలెను. లేదా ఆలయము ఏముఖముగా కట్టినప్పటికిని తూర్పు దక్షిణము పడమర ఉత్తరము ఈదిక్కులయందుగాని, ఈశాన్యము అగ్నేయము ఈదిక్కులయందుగాని కట్టవలెను. ఆమంటపము ఎటుచూచినను తొమ్మిదిహస్తముల ప్రమాణముగాను, చతురముగాను కట్టవలెను. మఱియు శల్యములు మొదలగు దోషములు లేకుండునట్లుగా త్రవ్వి బాగుచేసి పూర్వము చెప్పినట్లువలెనే శుద్ధినిమిత్తము వాస్తుహోమాదిక్రియలను జేయవలయును. మంటములోపల అంతయు 81 అడుగులుండవలెను. అందులో మధ్యభాగమునందు ఎటుచూచినను 3 అడుగులు ప్రమాణముకలిగి చతురము 9 అడుగులుగాను చతురశ్రముగా బ్రహ్మపదమును స్థానమేర్పరచవలెను. దానిచుట్టు 16 అడుగులు ప్రమాణము కలిగి దైవికస్థాన మేర్పరచవలెను. దానిచుట్టు 24 అడుగులు ప్రమాణము కలిగి మానుషస్థానమనునది యేర్పరచవలెను. దానిచుట్టు 32 అడుగులు ప్రమాణముతో పైశాచస్థాన మేర్పరచవలెను. మఱియు నడుమనేర్పఱచిన బ్రహ్మస్థానమందు వేదికను నిర్మించవలెను. తర్వాతనుండు దైవికస్థానములో మంగళాష్టకము నిర్మించవలెను. తర్వాతనుండు మానుషస్థానములో హోమకుండము నేర్పరచవలెను. తర్వాతనుండు పైశాచస్థానములో తోరణము కట్టవలెను. మఱియు వేదికను కాల్చినయిటుకలతోగాని పచ్చియిటుకలతోగాని మెత్తుపల్లములులేకుండ అద్దమువలెనే సమానముగా నుండునట్లు కట్టవలెను.

## అథ స్తంభలక్షణమ్.

శ్లో॥ స్తంభాశ్చ షోడశదృఢా శ్చత్వార స్తేషుమధ్యగాః। సారదారుభవాదేవి పంచహస్తోచ్ఛ్రితాసమాః ॥

తా॥ ఆమంటపమునకు 16 స్తంభములుండవలెను అందులో నడుమ 4 స్తంభములును వాటిచుట్టు 12 స్తంభములును నిర్మించవలెను. ఆస్తంభములు బాగా సారవంతముగునట్లుగాను 5 హస్తములు యెత్తు యుండునట్లుగాను హెచ్చుతగ్గులులేక సమానముగా నుండవలయును.

## అథ తోరణ లక్షణమ్.

శ్లో॥ అశ్వత్థోదుంబరప్లక్ష వటశాఖాకృతానిచ। మంటపస్య ప్రతిదిశం ద్వారాణ్యేతానికల్పయేత్ ॥ అవక్రాన్సత్వచస్సార్ద్రాన్ దం

డాస్స్వస్తోరణేసుభాః। శాన్తిభూతిబలారోగ్య పూర్వాద్యానామతః క్రమాత్ ॥ శూలేనచిహ్నితాః కార్యా ద్వారశాఖాశ్చమస్తకే। దశతాళసమాయామ స్తోరణానాంసమీరితః॥ ఆయామార్ధేనవిస్తారః కథితశ్శిఖివాహన॥

తా॥ రావి మేడి జువ్వి పత్రి మొదలగు శాఖలతో మంటపమునకు నాలుగు దిశలయందును ద్వారముల నేర్పరచవలెను. ఆశాఖలు వంకరలేకుండునట్లుగాను చర్మ కలవిగను, పచ్చివిగను ఉండునట్లు చూచి యోగ్యములగు ద్వారశాఖలను పెట్టవలెను. ఆద్వారశాఖలకు రెండింటిపైనను పైగానుండెడి ఉత్తరద్వారశాఖయందును శూలా కారముగా చెక్కించవలెను నిలుగానుండెడి ద్వారశాఖలు 10 జానలు పొడవును అడ్డముగానుండెడి పైద్వారశాఖయు దిగువద్వారశాఖయు నిలువుద్వారశాఖాప్రమాణ ములో సగముపొడవుండవలెను. మఱియు శాంతి భూతి బల ఆరోగ్య అను నాలుగు నామములు తూర్పు మొదలగు నాలుగుద్వారములకు నున్నవని శివుడు కుమారస్వామి తోచెప్పెను.

## దిగ్ధ్వజలక్షణమ్.

శ్లో॥ మంటపస్యబహిర్దండై ర్దశహస్తాయతైస్సహ। పూర్వాద్యష్టహరిత్స్వష్టౌ ధ్వజాన్సంస్థాపయేత్క్రమాత్॥ మాతంగబస్త మహిష సింహమత్స్యైణవాజినః। వృషభంహంసగరుడౌ ధ్వజమధ్యే క్రమాల్లిఖేత్॥ నారికేళదళైనైవ తాలపూగదళేనవా। ఊర్ధ్వమాచ్ఛాదయేన్మంత్రీ నీరంధ్రింతుసలక్షణం॥

తా॥ ఎనిమిదిదిక్కులయందు నెనిమిదిధ్వజములు మంటపముచుట్టు నుండవలయు నని యున్నది కాబట్టి 10 హస్తములు పొడవుగానుండెడి 8 ధ్వజములు నెనిమిదిదిక్కు లయందు నుంచవలెను. మఱియు ఏనుగు, మేక, మహిషము, సింహము, మత్స్యము, లేడి, గుఱ్ఱము, ఎద్దు, హంస, గరుడము, ఈ జంతువుల యాకారములు ధ్వజపటములలో లిఖించి పూర్వాదిదిక్కులయందు ధ్వజములనుంచవలెను. ఆమంటప మునకును పరిభాగమందు కొబ్బరియాకులతోగాని తాటియాకులతోగాని దట్టముగా కప్పి శోభస్కరముగా నుండునట్లు చేయవలెను.

## మంటపాలంకారః.

శ్లో॥ చూతపల్లవమాలాఢ్యం వితానైరుపశోభితం। విచిత్రవస్త్రసంఛన్నం తుల్యసంభవిభూషితం॥ సఫలైఃకదళీస్తంభైః క్రమ

కైర్నారికేళకైః। ఫలైర్నానావిధైరోభిజ్యై ర్దర్పణై శ్చామరైరపి॥ భూషితం మంటపంకుర్యాద్దర్భ పుష్పసముజ్వలం॥

మంటపము నలంకరించువిధ మెట్లనగా, మామిడి చిగుళ్ళ తోరణములు, చాంది నీలు, విచిత్రములగు వస్త్రములు, సమానమగు స్తంభములు, పండ్లతోగూడిన అరటి చెట్లు, పోకచెట్లు, కొబ్బరియాకులు, అనేకవిధములగు పండ్లు, భక్ష్యభోజ్యాదులు అద్దములు, వింజామరములు మొదలగు వస్తువులతో నెక్కడెక్కడ ఏవిధముగా నలంక రింపవలెనో ఆవిధముగా మంటపమును అలంకరింపవలెను.

## కుండలక్షణం.

శ్లో॥ నవకుండవిధానేతు దిక్షుకుండాష్టకేకృతే। నవమంకార యేత్కుండం పూర్వేశానదిగంతరే॥ పురందరేశయోర్మధ్యే వృత్తం వాచతురశ్రకం। అష్టాస్వాశాసుకుండాని రమ్యాకారాణ్యనుక్రమాత్॥ చతురశ్రం యోనిమర్ధ చంద్రంత్ర్యంశంసువర్తులం। షడ శ్రంపంకజాకార మష్టాశ్రంతానినామతః॥ ఆచార్యకుండంమధ్యేస్యా ద్గౌరీపతిమహేంద్రయోః॥

తా॥ హోమమును జేయుటకు కుండములుండవలయును. అందునిమిత్తము 9 కుండముల నేర్పరచెడివిధానములో నెనిమిదిదిక్కులయందు నెనిమిది కుండములును తూర్పు ఈశాన్యదిక్కుల నడుమ నొకకుండమును రమ్యముగా నుండునట్లు చేయవల యును. ఆకుండము లేవిధముగా నుండవలయుననగా, నాలుగుకోణములుకలది, యోని ఆకారము, అర్ధచంద్రాకారము మూడుఅంచులుకలది, గుండ్రనైనది, ఆరుఅంచులు కలది, పద్మాకారముకలది, యెనిమిది అంచులుకలది. ఇట్లు యెనిమిదివిధములుగానుండు కుండముల నెనిమిదిదిక్కులందు తీయవలెను. ఆచార్యకుండమును ఈశాన్యము తూర్పు దిక్కులనడుమను గుండ్రముగగాని నాలుగుకోణములు కలదిగగాని తీయవలయును.

## చతురశ్రకుండలక్షణం

శ్లో॥ సమంతాత్కుండమే తత్స్యా చ్చతురశ్రం శుభావహం। చతుర్వింశత్యంగులాఢ్యం మేఖలత్రితయాన్వితం॥

తా॥ చతురశ్రకుండమనగా నాలుగుపలకలుగా నిరువదినాలుగు అంగుళములు యెటుచూచిన నుండునట్లుగను మూడుమేఖలలు లుండునట్లును నిర్మింపవలయును.

## యోనికుండ లక్షణమ్.

శ్లో॥ చతుష్కోణీకృతం క్షేత్రం పంచధావిభజేత్సుధీః । న్యసేత్పుర స్తాదేకాంశం కోణార్ధార్ధప్రమాణతః । భ్రామయేత్కోణమానేన తథాన్యదపి మంత్రవిత్ । సూత్రయుగ్మం తతో దద్యాత్కుండం యోనినిభం భవేత్ ॥

తా॥ సమచతురసముగా చతుశ్రపండము నుండును కాఁబట్టి దానిని అయిదుభాగములుచేసి మధ్యగానుండు భాగముచివర రెండుసూత్రములనుంచి యాసూత్రముల రెంటిచివరలను పైగానుండు యయిదుభాగముల నిరుప్రక్కలనుండు కోణములపర్యంతము పట్టగ యోనిఆకారముగనుండును. అట్టియాకారముగా త్రవ్వబడినది యోని కుండమనఁబడును.

## అర్ధచంద్రకుండమ్.

శ్లో॥ నవధావిభజేత్క్షేత్రం చతురశ్రం సమంతథా । దక్షిణే చోత్తరే చాంశం ఏకైకంతు పరిత్యజేత్ ॥ సప్తాంశమధ్యసూత్రేణ భ్రమణాదర్ధచంద్రకం ॥

తా॥ చతురశ్రకుండమునకు నేర్పరచియుంచెడి ప్రదేశమును 9 భాగములు చేయుగా నిరుప్రక్కలనుండు రెండుభాగములను విడిచివేయుగ మిగిలినది 7 భాగములు. ఆభాగములమధ్యను దిగువసూత్రముబట్టి దానిని 7 భాగముల నిరుప్రక్కల పైగానుండు కోణములవరకు త్రిప్పగా నర్ధచంద్రాకారముగనుండును. ఆవిధముగ త్రవ్వబడినది అర్ధచంద్రాకారకుండము.

## త్ర్యశ్రకుండమ్.

శ్లో॥ చతుర్ధావిభజేత్ క్షేత్రం న్యసేదుభయపార్శ్వయోః । ఏకైకమంశంతన్మానా దగ్రతో లాంచయే త్తతః ॥ తత్రసూత్రత్రయం కుర్యాత్త్ర్యశ్రకుండ ముదాహృతం ॥

తా॥ చతురశ్రకుండప్రదేశమును నాలుగుభాగములుచేసి పైగా నిరుప్రక్కల కోణములవద్దను సూత్రములనుపట్టి ఆరెండుసూత్రములను దిగువప్రదేశమున మధ్యప్రదేశమునను కలిపి పట్టగా మూడుపలకలగనుండును. ఆవిధముగా త్రవ్వబడినది త్ర్యశ్రకుండము.

## వృత్తకుండమ్.

శ్లో॥ అష్టాదశాంశకేక్షేత్రే బహిరంశంన్యసేద్బుధః। భ్రామయే త్తేనమానేన వృత్తకుండమనుత్తమం॥

తా॥ చతురశ్రకుండప్రదేశమును 18 భాగములుచేసి దాని పయముగ సూత్రమునుపట్టి బహిరంశమునందు సూత్రమును త్రిప్పుచురాగా వృత్తాకారముగ నుండును అట్టి యాకారముగ త్రవ్వబడినకుండము వృత్తకుండము.

## షడశ్రకుండమ్.

శ్లో॥ అష్టధావిభజేత్ క్షేత్రం మధ్యసూత్రస్యపార్శ్వయోః। భాగంన్యసేదేకమేకం మానేనానేనమధ్యతః॥ కుర్యాత్పార్శ్వయుగే మత్స్య చతుష్కంశాస్త్రవిత్తమః। సూత్రషట్కంతతోదద్యా త్షడశ్రం కుండముత్తమం॥

తా॥ కుండప్రదేశము నెనిమిదిభాగములుచేసి నడుమసూత్రము యొక్క రెండు ప్రక్కలను ఒక్కొక్కభాగమునుంచి మధ్యప్రదేశమునకు రెండుప్రక్కలను ఇటురెండు అటురెండు నాలుగు మత్స్యాకారములనుగీచి ఆరుసూత్రముల నారుకోణములను పట్టగా షడశ్రముగనుండును ఆవిధముగ నుండునది షడశ్రకుండము.

## పద్మకుండమ్.

శ్లో॥ వృత్తానికర్ణికాదీనాం బహిస్త్రీణిప్రకల్పయేత్। పద్మకుండమితిఖ్యాతం పశ్యతాంసుమనోహరం॥

తా॥ కర్ణిక మొదలగువాట్లను వెలుపలను మూడువృత్తములు గీచినయెడల దానిని పద్మకుండమని చెప్పిరి.

అన్యః॥ శ్లో॥ చతుర్భాగకృతంక్షేత్రం ఏకైకాంశంన్యసేత్తతః। క్షేత్రార్ధంతేనమానేన మత్స్యంకృత్వావిచక్షణః॥ తన్మధ్యమాచ్చతుర్దిక్షు చతుష్పత్రంతువర్తులే। సరోజకుండమేవంతు కల్పయేచ్ఛాస్త్రకోవిదః॥

తా॥ పద్మకుండమునుగురించి మరియొకరు చెప్పిన దేమనగా, నాలుగుభాగములుగ క్షేత్రములను విభజించి క్షేత్రార్ధభాగమును ఒక్కొక్క అంశముచొప్పున హెచ్చుగనుంచుకొనుడు అట్టి ప్రమాణముగానే మత్స్యాకారముగాగీచి దాని మధ్యప్రదేశ

మునుండి నాలుగుదిక్కులను నాలుగుపత్రములను వర్తులముగ గీచిన పద్మాకారమగును. అట్టి యాకారముగ నుండునది పద్మకుండమని మరియొకరుచెప్పిరి.

## అష్టాశ్రికుండమ్.

శ్లో॥ షడ్భిఃనుష్వష్టాశ్రికుండం హై క్షేత్రేగాయతిభాజితే। తదేకాంశంబహిర్న్యస్య పరితశ్చతురశ్రికం॥ కర్ణార్ధసూత్రమానేన కోణాత్కోణంతులాంఛయేత్। చతుర్దిక్ష్వష్టకోణాఖ్యం కుండంకుర్యాత్సలక్షణం॥

తా॥ అష్టాశ్రకుండ మెట్లనగా క్షేత్రమును మూడుభాగములుచేసి దానిలో నొక అంశమును వెలుపలనుంచి దానిచుట్టు చతురశ్రముగగీచి చెవియొక్క ప్రమాణములో సగముప్రమాణముగనుండు సూత్రమును నాలుగువైపులను పట్టిన అష్టకోణముగనుండు కుండమగును.

శ్లో॥ మానహీనేమహావ్యాధి రధికేశత్రువర్ధనం। భగ్నేచైవత్వనావృష్టి స్ఫుటితేసస్యనాశనం॥

తా॥ ఈప్రకారము కుండములప ప్రమాణము చెప్పబడియున్నది. ఈచెప్పబడిన ప్రమాణముకంటె తక్కువగానుండినయెడల గొప్పవ్యాధికలుగును. హెచ్చుగానుండినయెడల శత్రువులవల్ల బాధకలుగును. ఆకుండము చెడిపోయినయెడల అనావృష్టిదోషము సంభవించును. బ్రద్దలైపోయినయెడల సస్యనాశనము కలుగును.

## అంగుళలక్షణమ్.

శ్లో॥ మాత్రాంగులేనకర్తవ్య మన్యేనైవనకారయేత్। కర్తుర్దక్షిణహస్తస్య మధ్యమాంగుళిపర్వణః॥ తన్మధ్యదైర్ఘ్యమానేన మాత్రాంగులముదాహృతం॥

తా॥ కొలతయొక్క ప్రమాణ మెట్లనగా, మాత్రాంగుళప్రమాణముచేతనే కొలవవలయును. మఱియొకవిధముగ కొలవకూడదు. మాత్రాంగులమనగా యజమానునియొక్క కుడిచేతి నడిమివ్రేలియొక్క మూడుపర్వములలో మధ్యపర్వము ఎంతపొడవుండునో ఆపొడవు ప్రమాణము మాత్రాంగుళమని చెప్పఁబడును.

## మేఖలాలక్షణమ్.

శ్లో॥ కుండంత్రిమేఖలోపేత మేకమేఖలమేవవా। త్రిమేఖలోర్ధ్వమానంతు షడ్త్యగ్న్యశ్వినికాంగులైః॥ యదాకారానికుండాని తదాకారాణికారయేత్॥

తా॥ ఈ చెప్పబడిన హోమకుండములకు మూడు మేఖలములుగాని లేదా యొక మేఖలముకాని యుండవలయును. మూఁడు మేఖలముల నేర్పరచినయెడల దిగువమేఖలము నాలుగంగుళములు మధ్యమేఖలము మూడంగుళములు పైమేఖలము రెండంగుళములు వెడల్పుగనుండవలెను. కుండము లేయాకారముగనుండిన మేఖలములుకూడ అట్టియాకారముగానే యుండవలయును.

## యోనిలక్షణమ్.

శ్లో॥ అగ్న్యంగులంతువిస్తారం దైర్ఘ్యంభూతాంగులంభవేత్। క్రమేణకృశితాయోనిః కార్యాపిప్పలపత్రవత్ ॥

తా॥ మూడంగుళములు పైభాగమున వెడల్పుగనుండి అయిదంగుళములు పొడవుగనుండి క్రమముగ చివరకు వెడల్పు తగ్గిపోయి రావియాకువలెనే చివర సన్నముగా నుండునట్లు చేయుట యోనియాకారమగును.

## కుండనాభిలక్షణమ్.

శ్లో॥ పద్మాకారంతదానాభిం, కుర్యాత్కుండస్యమధ్యమే। ద్విభాగందళమానంస్యా దేకభాగంతుకర్ణికా॥ యోనౌయోనిర్నకర్తవ్యా పద్మేనాభింనకారయేత్। సుధాపక్వేష్టికాభిర్వా మృదాకుండం ప్రకల్పయేత్ ॥

తా॥ కుండములో మధ్యభాగమందు పద్మాకారముగ నాభినేర్పరచవలయును. అప్పుడు రెండుభాగములు పద్మరేకులయాకారముగను ,ఒకభాగము మధ్యనుండు కర్ణికగనుండవలయును. యోనియందు యోనియాకార ముండగూడదు. పద్మాకారములో నాభియాకారముండగూడదు. ఇట్టికుండముల నేర్పరచినప్పుడు సున్నములోను కాల్చిన యిటుకలతోను కట్టవలయును. అది సాధ్యముకానియెడల మట్టితోనైనను కట్టవలయును.

శ్లో॥ మేఖలారహితేకుండే వ్యాధిర్భవితసంశయః। భార్యావినాశనంప్రోక్తం కుండేయోన్యావినాకృతే॥ అపత్యధ్వంసనంప్రోక్తం కుండం యత్కంఠవర్జితం ॥

తా॥ కుండమునకు మేఖలముల నేర్పరచకుండినయెడల దుఃఖము సంభవించును. అధికముగనున్నయెడల ధననాశనమగును. కుండములో యోన్యాకార మేర్పరచకున్న

యెడల భార్యానాశనము సంభవించును. కుండమునకు కంఠాకార మేర్పరచకున్న యెడల సంతాననాశనము కలుగును.

## ఏకహస్తపరిమాణ కుండలక్షణమ్.

శ్లో॥ తిథ్యంగులసమంఖాతం మేఖలాస్యాన్నవాంగులా। ఖాతాద్బాహ్యాంగుళంకంఠం తద్బాహ్యే మేఖలాత్రియం ॥

తా॥ ఒకహస్త ప్రమాణముగల కుండవిధాన మెట్లనగా, 30 అంగులములు లోతున్ను, 9 అంగులములు మేఖలముల వెడల్పున్ను యుండవలయును. గొయ్యికి వెలుపలగా నొక యంగుళపరిమాణము వెడల్పుతో కంఠాకారము నేర్పరచవలయును. ఆకంఠమునకు వెలుపలభాగమునందు మూడు మేఖలముల నేర్పరచవలయును.

## ఉత్సవశబ్దార్థః.

శ్లో॥ సవఇత్యుచ్యతేదుఃఖ ముధృతస్సనవైశివే। యస్మాత్తస్మాదుత్సవోవై షడ్విధస్సమహోత్సవః॥ పైతృకోద్వాదశాహస్స్యాన్నవాహస్సాఖ్యఉచ్యతే। సప్తాహశ్శ్రీకరఃప్రోక్తః పంచాహఃపార్థివస్మృతః॥ సాత్వికస్త్వత్ర్యహఃప్రోక్త శ్శైవకాహశ్శైవనామకః॥

తా॥ ఉత్సవశబ్దమునుగురించి విమర్శించిచెప్పుచున్నాడు. ఉత్-సవః- అని ఉత్సవశబ్దమునకు పదచ్ఛేదము. సవః అనగా దుఃఖము, అట్టి దుఃఖను ఉధృతః నివారింపబడును. అని పదార్థముగాన శివునివల్ల నివారింపబడును కాబట్టి ఉత్సవమని చెప్పబడును. అట్టి యుత్సవ మారువిధములుగనున్నది. 12 దినములుకలది పైతృకోత్సవము, 9 దినములు సాఖ్యోత్సవము, 7 దినములు శ్రీకరోత్సవము, 5 దినములు పార్థివోత్సవము, 3 దినములు సాత్వికోత్సవము, 1 దినము శైవోత్సవము. ఇట్లు ఆయా దినముల సంఖ్యాప్రకారము 6 విధములగు యుత్సవముల నామములు చెప్పఁబడినవి.

## తీర్థనక్షత్రనిర్ణయః

శ్లో॥ ఆర్ద్రిరేచేరనక్షత్రే గ్రామర్క్షేమాసభేవరే। నృపకర్తృజన్మభేచ త్వయనేవిషువాదికే॥ సంక్రాన్తౌ గ్రహణేచైవ రాజరాష్ట్రశుభావహే। అన్యేపుణ్యదినేచైవ మహాతీర్థంప్రశస్యతే॥

తా॥ ఉత్సవము తీర్థకాలమనియు చెప్పబడును కాబట్టి అట్టితీర్థము జరుపుటకు యింక మరికొన్ని సమయములును కలవు. అవి యేవనగా ఆర్ద్రానక్షత్రము, ఆలయ

నక్షత్రము, గ్రామనక్షత్రము, మాసనక్షత్రము, రాజుయొక్క నక్షత్రము, యజమానుని జన్మనక్షత్రము. ఇవి వచ్చినప్పుడును, అయనములు, విషువత్పుణ్యకాలములు, సంక్రాంతులు, గ్రహములు, రాజులకుగాని రాష్ట్రమునకుగాని శుభములు సంభవించినప్పుడు మరి యితరములగు ఏపుణ్యదినములు సంభవించినప్పుడును ఉత్సవము జరుపుకొనవచ్చును.

## ఉత్సవస్త్రివిధః.

శ్లో॥ ఉత్సవస్త్రివిధస్తేషాం లక్షణంవక్ష్యతేధునా। ధ్వజమారోపయిత్వాదౌ భేరీంరాత్రౌతుతాడయేత్ ॥ కృత్వాంకురార్పణం పశ్చాద్ధ్వజారోహణపూర్వకః। ఆదౌభేరీంతాడయిత్వా ధ్వజమారోపయేత్తతః॥ అంకురార్పణమన్తేతు సోభేరీపూర్వకోత్సవః। కృత్వాంకురార్పణంపూర్వం తతోభేరీంతుతాడయేత్ ॥ ధ్వజమారోపయేత్పశ్చాదంకురార్పణపూర్వకః॥

తా॥ ఉత్సవము మూడువిధములుగ నున్నదని చెప్పబడెను కాంబట్టి వాటి లక్షణము చెప్పెదను అది యెట్లనగా, ముందు ధ్వజముయెత్తి పిమ్మటను రాత్రి భేరీనివాయించవలయును. అనంతరము అంకురార్పణచేయుట. ఇది ధ్వజారోహణపూర్వకోత్సవము. ముందుగా భేరీనివాయించుట, తర్వాత ధ్వజమెత్తుట, అనంతర మంకురార్పణ చేయుట, ఇది భేరీపూర్వకోత్సవము. ముందుగా నంకురార్పణజేయుట, అనంతము భేరీని వాయించుట, పిమ్మట ధ్వజమెత్తుట, ఇది ధ్వజారోహణపూర్వకోత్సవము. ఇట్లు యుత్సవము మూడువిధములుగ జెప్పంబడెను.

## సౌఖ్యోత్సవయానక్రమః.

శ్లో॥ ప్రథమే సింహయానంస్యా ద్ద్వితీయే చంద్రమండలం। శేషయానంతృతీయేతు తురీయేపుష్పమంటపం॥ పంచమే వృషభం షష్ఠే రాత్రౌ హస్త్యుత్సవంచరేత్। సప్తమేహ్నిరథంరాత్రౌ శిలాదతనయంపరం॥ అష్టమేదివసేశ్వంవై నవమేహంసయానకం। దశమే దివసేరాత్రౌ శిబికాయాం మహోత్సవం॥ ప్రకుర్యాత్పరయాభక్త్యా నానావిభవవిస్తృతైః। వాహనానామలాభేతు భద్రపీఠేసమాచరేత్॥

తా॥ సౌఖ్యోత్సవమునందు వాహనము లేవిధముగననగా, మొదటిదినమందు సింహవాహనము రెండవదినమందు చంద్రమండలవాహనము, మూడవదినమందు ఆదిశేషవాహనము, నాల్గవదినమందు పుష్పమంటపవాహనము, అయిదవదినమందు వృషభ

వాహనము, ఆరవదినమందు గజవాహనము, ఏడవదినమందు రథము, లేక కైలాసవాహనమైనను, ఎనిమిదవదినమందు అశ్వవాహనము, తొమ్మిదవదినమందు హంసవాహనము, పదియవదినమందు మేనాసవారి. ఇట్లు పదిదినములయందును పైన చెప్పఁబడిన పదివాహనములమీద స్వామినెక్కించి మహావైభవముతోను విశేషమగు భక్తితోను రాత్రులయందు నూరేగింపు జరిగింపవలయును. ఈచెప్పఁబడిన వాహనములు సంభవించనియెడల భద్రపీఠము నెక్కించి యూరేగింపు చేయవలయును. భద్రపీఠమనగా చల్లాచప్రమని యిప్పుడు అందరు చెప్పుచుందురు.

## నవదినాది దేవతారాత్రయః.

శ్లో॥ గాన్ధర్వరాత్రః ప్రథమే ద్వితీయే భూతరాత్రికం। స్కాంద రాత్రింతృతీయే స్యా ద్వృషిరాత్రం తురీయకే॥ పంచమే నాగరాత్రం స్యా త్షష్ఠే చంద్రమసంతథా। సప్తమే వైష్ణవంరాత్రి మష్టమే బ్జజరాత్రికం॥ నవమే శివరాత్రింస్యా దిత్యేతే దైవరాత్రయః॥

తా॥ ఇట్లు యుత్సవము జరుగునప్పుడు తొమ్మిదిరాత్రులకు నామము లేవిధమనగా, గాంధర్వరాత్రి, భూతరాత్రి, స్కాందరాత్రి, ఋషిరాత్రి, నాగరాత్రి, చంద్రరాత్రి, వైష్ణవరాత్రి, బ్రహ్మరాత్రి, శివరాత్రి. ఇట్లు మొదటిదినము మొదలు తొమ్మిదవ దినమువరకు క్రమముగ దేవతాసంబంధమగు రాత్రులుగ చెప్పఁబడెను.

## నవరాత్రిపాధిపానాం బలిప్రధానవిధిః.

శ్లో॥ లడ్డుకంకృసరాన్నంచ కదళీగుణమిశ్రితం। ప్రథమే హనిదాతవ్యం గాంధర్వం మన్త్రముచ్చరన్॥

తా॥ తొమ్మిదిదినములకు నధిపతులైన దేవతలకు బలిప్రదానముచేయుట యెట్లనగా, లడ్డులు పులగము అరటిపండ్లు, బెల్లము. ఈపదార్థములను గంధర్వదేవతాసంబంధమగు మంత్రమును జదువుచు మొదటిదినమునందు బలిప్రదానము జేయవలయును.

శ్లో॥ ముద్గాన్నం గుడసంయుక్తం మధుక్షీర ఘృతాన్వితం। ద్వితీయే హనిదాతవ్యం భూతమంత్రమనుస్మరన్॥

తా॥ పెసరపప్పు కలిపి వండినయన్నమును బెల్లముకలిపియు, తేనె పాలు నెయ్యి మొదలగువానిని కలిపిన యన్నమును భూతసంబంధమగు మంత్రమును జదువుచు రెండవదినమునందు బలిప్రదానము జేయవలయును.

శ్లో॥ పాయసాన్నం ఘృతంచైవ కదళీగుడసంయుతం। తృతీయే హనిదాతవ్యం స్కాందమంత్రమనుస్మరన్॥

తా॥ నెయ్యి అరటిపండ్లు బెల్లము మొదలగువానితోను పరమాన్నముతోను కుమారస్వామి సంబంధమగు మంత్రమును జదువుచు మూడవదినమందు బలిప్రదానము చేయవలయును.

శ్లో॥ ఘృతేనాప్లుతశుద్ధాన్నం బృహతీఫలమేవచ। చతుర్థే హానిదాతవ్యం ఋషిమంత్రమనుస్మరన్ ॥

తా॥ నాల్గవదినమునందు నెయ్యికలిపిన యన్నమును వాకుడుకాయలను ఋషి సంబంధమగు మంత్రమును జదువుచు బలిప్రదానమును జేయవలెను.

శ్లో॥ మాషపిష్టాజ్యమధుభి ర్మిశ్రితం శుద్ధమోదనం। పంచమే హానిదాతవ్యం నాగమంత్రమనుస్మరన్ ॥

తా॥ మినపపిండియు నెయ్యి తేనెతో కలిపిన యన్నమును సర్పసంబంధమైన మంత్రమును జదువుచు అయిదవరోజున బలిప్రదానము జేయవలెను.

శ్లో॥ శుద్ధాన్నం దధిసంయుక్తం గుడఖండసమన్వితం। షష్ఠమే హానిదాతవ్యం చంద్రమంత్రమనుస్మరన్ ॥

తా॥ పెరుగుతో కలిపిన యన్నమును చెరుకుగడ ముక్కలును చంద్రసంబంధమగు మంత్రమును జదువుచు ఆరవదినమునందు బలిప్రదానము జేయవలయును.

శ్లో॥ శుద్ధాన్నం నారికేళంచ క్షీరసర్పిర్విమిశ్రితం। సప్తమే హానిదాతవ్యం విష్ణుమంత్రమనుస్మరన్ ॥

తా॥ కొబ్బరికాయలు పాలు నెయ్యి కలిపినయన్నమును విష్ణుసంబంధమగు మంత్రమును జదువుచు నేడవదినమునందు బలిప్రదానము జేయవలెను.

శ్లో॥ గుడాన్నం బృహతీపిష్టం దధిక్షీరవిమిశ్రితం। అష్టమేహాని దాతవ్యం బ్రహ్మమంత్రమనుస్మరన్ ॥

తా॥ బెల్లముకలిపిన యన్నమును పెరుగు పాలుతో కలిపిన వాకుడుపిండియును బ్రహ్మసంబంధమగు మంత్రమును జదువుచు యెనిమిదవదినమునందు బలిప్రదానము జేయవలెను.

శ్లో॥ శుద్ధాన్నం దధిసంయుక్త మేలానాగరసంయుతం। నవమే హానిదాతవ్యం శివమంత్రమనుస్మరన్॥

తా॥ పెరుగుకలిపిన యన్నమును ఏలకులు శొంఠి మొదలగు వస్తువులుకలిపిన యన్నమును శివసంబంధమగు మంత్రమును జదువుచు తొమ్మిదవదినమునందు బలిప్రదానము జేయవలయును.

శ్లో॥ దినదేవావాహనంస్యా దేవముక్తవిధానతః। బలిదానం ప్రకుర్యాచ్చ ప్రత్యహం దేశికస్తథా॥

తా॥ ఈ ప్రకారమాచార్యుఁడు ప్రతిదినమునందును ఆయాదినములకు నధిపతులుగా జెప్పఁబడిన దేవతలను ఆవాహనముజేసి బలిప్రదానము జేయుచుండవలయును.

శ్లో॥ బ్రహ్మాదీశానపర్యంతం లోకపాలబలింక్షిపేత్। ఆరంభంతుక్రియాద్రాత్రౌ సమాప్తదివసేతథా। ప్రకుర్యాద్బలిమేకైకం తత్తన్మంత్రమనుస్మరన్॥

తా॥ ఇట్లు ప్రారంభించుట రాత్రియందే చేయవలయును. అప్రకారముగానే సమాప్తిచేయుటయు రాత్రియందే చేయవలయును. ఇట్లు ఆయాదినములయందు ఆయా దేవతలకు నాయా మంత్రములను జెప్పుచు నొక్కొక్క బలిప్రదానము చేయవలయును.

శ్లో॥ గంధర్వాద్విష్ణురాత్ర్యంత శ్శ్రీకరస్యోత్సవస్మృతః। గంధర్వాన్నాగరాత్ర్యంతః పార్థివస్యోత్సవోభవేత్॥ గంధర్వాద్గుహరాత్ర్యంత స్సాత్వికస్యోతవస్మృతః॥

తా॥ గంధర్వరాత్రి మొదలు విష్ణురాత్రివఱకు అనఁగా మొదటిదినము మొదలు తొమ్మిదవదినముపర్యంతము జేయఁబడు యుత్సవము శ్రీకరోత్సవమని చెప్పఁబడును. గంధర్వరాత్రి మొదలు నాగరాత్రి పర్యంతము అనఁగా మొదటిదినము మొదలు అయిదవదినముపర్యంతము చేయబడెడి యుత్సవము పార్థివోత్సవమని చెప్పఁబడును. గంధర్వరాత్రి మొదలు స్కందరాత్రిపర్యంతము అనఁగా మొదటిదినము మొదలు మూడవదినమువరకు చేయబడు యుత్సవము సాత్వికోత్సవమని చెప్పఁబడును.

## అంకురపాలికాదీనాం లక్షణమ్.

శ్లో॥ పాలికాఘటికాశ్చేతి శరావాశ్చేతిధాస్మృతాః। వక్ష్యే లక్షణం తేషాం శృణుష్వకమలానన॥

తా॥ అంకురపాలికలు మొదలగు వానియొక్క లక్షణములను జెప్పుచున్నాఁడు. బ్రహ్మన్! పాలికలు, ఘటికలు, శరావములు అని మూడువిధములుగా నంకురములు వేయుటకు పాత్రలు చెప్పఁబడెను.

శ్లో॥ హేమరాజితతామ్రైర్వా మృణ్మయావాప్రకల్పయేత్ ।
మాత్రాంగుళపరిమాణేన కర్తవ్యాః పాలికాదయః ॥

తా॥ బంగారు వెండి రాగి యీలోహములలో తనశక్తికొలది పాలికలు మొద లగునవి చేయించవలయును. అంతను శక్తిలేనియెడల మట్టితోనైనను చేయించవల యును, మాత్రాంగుల ప్రమాణముగానే పాలికాదులు చేయవలెను. మాత్రాంగుల పరిమాణము వెనుక చెప్పఁబడెను.

శ్లో॥ మన్వంగులైః ప్రకుర్యాచ్చ పాలికాముఖవిస్తృతం ।
ఏకైకాంగులహీనంస్యా న్మధ్యమస్యాధమస్యచ ॥ విస్తారేణసమోత్సే ధం తదర్ధంపాదవిస్తరం । విస్తారరసభాగైకం పరితశ్చోష్ఠమాచరేత్ ॥ విస్తారస్యత్రిభాగైకం వర్తితంబిలమీరితం । విస్తారయుగభాగైకం దం డవిస్తారమాచరేత్ ॥ పాలికాలక్షణంప్రోక్తం ఘటికాలక్షణంశ్రుణు ॥

తా॥ పాలికలయొక్క ముఖము వెడల్పు 14 అంగుళము లుండవలయును. 13 అంగుళముల వెడల్పు మధ్యమము, 12 అంగుళములవెడల్పు హీనము. ముఖము వెడల్పు యెంతవుండునో యెత్తుకూడ అంతయుండవలయును. లేదా దానిలో సగము గాని నాల్గవవంతుగాని యుండవచ్చును. వెడల్పులో ఆరవవంతుగాని ఒకఅంగుళము చుట్టు అంచు యుండవలెను. విస్తారములో మూడవవంతు గుండ్రనిబిలముండవలెను. విస్తారములో రెండవవంతు దండముయొక్క విస్తారపరిమితి యుండవలెను. ఇట్లు పాలి కలయొక్క లక్షణము చెప్పఁబడెను. ఇకను ఘటికలయొక్క లక్షణము చెప్పెదను,

## ఘ టి కా ల క్ష ణ మ్.

శ్లో॥ ఘటికాఃపంచవక్త్రాస్స్యు స్తన్మధ్యేకలశాకృతిః । షడం గుళంచవిస్తీర్ణ మేతాసాంమధ్యమంముఖం ॥ ఘటికాలక్షణంప్రోక్తం శరావాణామథశృణు । ద్వాదశాంగుళముత్సేధం విస్తారంతుదశాం గుళం ॥

తా॥ అయిదుముఖములుగను వాటిమధ్య కలశాకారముగను ఉండునవి ఘటిక అని చెప్పఁబడును. వీటి ముఖవిస్తీర్ణము ఆరంగుళము లుండవలయును. ఇట్లు ఘటికల యొక్క లక్షణము చెప్పబడినది. ఇక శరావముల లక్షణమెట్లనగా, 12 అంగుళముల యెత్తును 10 అంగుళముల వెడల్పుకలవి శరావములని చెప్పఁబడును.

## ధ్వజస్థాననిర్ణయః.

శ్లో॥ పీఠగోపురయోర్మధ్యే పీఠాగేవావృషాగ్రికే। మహా మర్యాదమధ్యేచ విజానీయాద్ధ్వజస్థలం ॥

తా॥ పీఠము గోపురముల మధ్యగాని పీఠమునకు ముందుగాని నందీశ్వరునకు ముందుగాని స్వామికి నెదురుగానుండెడి విశాలస్థలములో ధ్వజముంచుటకు తగిన స్థలమని చెప్పిరి.

## ధ్వజదండలక్షణమ్.

శ్లో॥ వక్రంభిన్నంచసుషిరం క్రిమికీటాదిసంయుతం। ఇత్యాది దోషసంయుక్తం ధ్వజదండం పరిత్యజేత్ ॥

తా॥ వంకరగానుండునదియు బ్రద్దలైనదియు రంధ్రములు కలదియు పురుగులు మొదలగువానిచే వ్యాపించియుండునదియు ఈ మొదలగు దోషములు కలది ధ్వజమునకు పనికిరాదు.

శ్లో॥ సుదృఢంసత్వచంసాంద్రం స్నిగ్ధంనవమృజుంవరం। చందనంక్రముకంసాలం బిల్వంవైణవఖాదిరే॥ మధూకపనసాశోక పాదపేషు సముద్భవం। దండంసంగ్రాహయేద్ధీమాన్ ధ్వజార్థంగిరిజాత్మజ॥

తా॥ ఓ కుమారస్వామీ! దృఢముగా నుండునదియు, చర్మముకలదియు, చిక్కగానుండునదియు, మృదువైనదియు, వంకరలేక తిన్నగానుండునదియు, నూతనమైనదిగను ధ్వజము నేర్పరచవలయును. మఱియు మంచిగంధము పోక యేపి మారేడు వెదురు చండ్ర ఇప్ప పనస అశోకము మొదలగు కొయ్యలతో ధ్వజము నేర్పరచవలయును. ఉత్కృష్టస్థలపర్యంతముగాని స్థూప్యమువరకుగాని గళమువరకుగాని శిఖరాంతముగాని యెంతపొడవుండునో అంతపొడవుగల ధ్వజమునుసలక్షణమైనదిగా చూచి స్థాపన చేయవలయును.

## వృషపటలక్షణమ్.

శ్లో॥ సప్తాష్టనవహస్తోచ్ఛ్రం భూతభాగైకవిస్తృతం। తత్పటంపంచధాభజ్య మధ్యభాగేవృషంలిఖేత్ ॥

తా॥ ఏడుగాని యెనిమిదిగాని తొమ్మిదిగాని హస్తములపొడవును ఐయిదుహస్తముల వెడల్పును గల పటమును అయిదుభాగములుగ విభజించి నడిమిభాగమందు వృషభాకారముగ ధ్వజపటమందు లిఖించవలయును.

శ్లో॥ వృషభంరక్తవర్ణేన వాలంపీతేన లేఖయేత్ । శృంగ ద్వయం శోత్రయుగం రక్తవర్ణేన బుద్ధిమా౯ ॥ అక్షియుగ్మం శ్వేత నీలవర్ణాభ్యాం విలిఖేత్ క్రమాత్ । ఖురాంశ్చరక్తవర్ణేన మస్తకో ర్ధ్వేతతస్సుధీః ॥ ఛత్రద్వయం చామరేద్వే చోల్లిఖేచ్ఛిల్పకోవిదః ॥

తా॥ ఆవృషభాకారము లిఖించుట యెట్లనగా, వృషభము నెఱ్ఱరంగుతోను, తోకను పచ్చరంగుతోను, రెండు కొమ్ములను రెండుచెవులను యెఱ్ఱరంగుతోను, రెండు నేత్రములను తెల్లరంగుతోను, నేత్రములలో పాపను నల్లరంగుతోను, డెక్కలను శిర స్సును యెఱ్ఱరంగుతోను ఇట్లు వృషభాకారమును లిఖించి దానివద్ద రెండు ఛత్రాకార ములను రెండు చామరాకారములను గూడ లిఖించవలెను.

శ్లో॥ నానాలంకారసంయుక్తం కింకిణీమాలయావృతం । పద్మ పద్మపీఠేస్థితంపుష్ట్యై శయానంశాంతయేతథా ॥ సంలిఖేత్పటమధ్యేతు వృషభంలక్షణాన్వితం ॥

తా॥ ఇట్లు వృషభము ననేక ఆలంకారముతో గూడినదానినిగాను చిరిఘంటల దండకలదిగాను భద్రపీఠమునందుండి పుష్టిగానున్నట్లుగను శాంతస్వభావముతో శయ నించియున్నట్లుగాను ఇట్లు సమస్తలక్షణములు కలదానినిగ పటమునందు నిపుణుఁడగు శిల్పివిశేఖరి లిఖించవలెను.

## తత్పటలక్షణమ్.

శ్లో॥ దేవాంగంచిత్రక్షౌమంవా గ్రహేత్కార్పాసికంతథా । స్నిగ్ధంసులక్షణంరమ్యం నీలరోమాదివర్జితం ॥

తా॥ శుభ్రమగు పట్టువస్త్రముగాని దృఢమైన నూలువస్త్రముని మృదువుగాను మనోహరముగను నల్లని వెంట్రుకలు మొదలగునవి లేనిదిగను జూచి సంపాదించి వృష భాకారమును లిఖించవలెను.

## పవిత్రలక్షణమ్.

శ్లో॥ నవపంచత్రిభిర్దర్భైః పవిత్రంకారయేత్సుధీః। తల్లక్షణంతు వక్ష్యేహం గ్రంథిరేకాంగులోభవేత్ ॥ చతురంగులమగ్రంస్యా ద్వాల యంద్వ్యంగులంమతం । దర్భద్వయేనవాకార్యం తప్తచామీకరే ణవా ॥ ప్రదక్షిణాన్విత గ్రంథిర్నామికాయాం నియోజ రేత్ ॥

తా॥ పవిత్రలక్షణ మెట్లగా, తొమ్మిదిగాని అయిదుగాని మూడుగాని దర్భలతో పవిత్రమును కట్టవలయును. ఆపవిత్ర మెట్టిలక్షణము కలిగియుండవలయుననగా, ముడి యొక అంగుళము చివళ్ళు నాలుగంగుళములు రెండంగుళములు వలయముండవలయును. శక్తియున్నయెడల పన్నెకలిగియుండెడి బంగారముతో జేయించవచ్చును. లేక రెండుదర్భలతోనైనను ముడి ప్రదక్షిణముగ నుండునట్లు పవిత్రముకట్టి కుడిచేతి అనామికవ్రేలిని పెట్టుకొనవలయును.

## పరిస్తరణలక్షణమ్.

శ్లో॥ ధర్మ్యకాశ సమాయుక్తం గ్రంధిఃపత్త్యాంగులోభవేత్ ॥
వేదాంగులంభవేదగ్రం షట్ త్రింశదంగులాయతం॥

తా॥ పరిస్తరణలక్షణ మెట్లనగా, రెల్లుగాని విశ్వామిత్రమనెడి దర్భలనుగాని తెచ్చి రెండంగుళములు ముడియును ముడితర్వాత నాలుగంగుళములు అగ్రములుండవలయును. వాటిపొడవు ముప్పదియారంగుళము లుండవలెను.

## ప్రోక్షణపాత్రలక్షణమ్.

శ్లో॥ బాణాంగులంతువిస్తార ముత్సేధంతుగుణాంగుళం॥

తా॥ అయిదంగుళముల పొడవును మూడంగుళముల యెత్తును కలుగునట్లు ప్రోక్షణపాత్ర యుండవలయును.

## ప్రణీతాపాత్రలక్షణమ్.

శ్లో॥ సార్ధభూతాంగులంతారం సార్ధాంగులసముచ్ఛ్రియం॥

తా॥ ప్రణీతాపాత్ర అయిదంగుళములన్నర పొడవును అంగుళమున్నరయెత్తును కలదిగా నుండవలెను.

## ఆజ్యపాత్రలక్షణమ్.

శ్లో॥ వేదాంగులసముత్సేధం విస్తారంతుషడంగులం॥

తా॥ నాలుగంగుళముల యెత్తుగను ఆరంగుళముల పొడవును ఆజ్యపాత్రను సుండవలెను.

## చరుపాత్రలక్షణమ్.

శ్లో॥ ధర్మాంగులప్రమాణేన విస్తారముదరస్యతు। వస్వంగులం రదుత్సేధం కంఠమేకాంగులంభవేత్ ॥

తా॥ మధ్య నుదరప్రదేశవిస్తారము 9 అంగుళములును 8 అంగుళముల యెత్తును 1 అంగుళము కంఠప్రదేశపరిమాణమును చరుపాత్రనుండవలయునని చెప్పిరి.

శ్లో॥ చతుర్వింశతిదర్భైశ్చ జ్ఞానఖండం ప్రకల్పయేత్ । ఉత్సేధంతాలమానేన కారయేత్త్రిణిబంధవత్ ॥

తా॥ ఇరువదినాలుగు దర్భలతో జ్ఞానఖండ మేర్పరచవలయును. దానికి నొక యంగుళ మెత్తును మూడుముళ్ళు నుండవలయును

## లంబకూర్చలక్షణమ్.

శ్లో॥ ఏకవింశతిసంఖ్యాకై ర్దర్భైఃకూర్చంప్రకల్పయేత్ । గ్రంథిరేకాంగులఃప్రోక్తశ్చా యామో మూర్తిమానతః ॥ గ్రంథిస్తుదక్షిణావర్తః కూర్చాగ్రం చతురంగులమ్ ॥

తా॥ 21 దర్భలచే కూర్చను కట్టవలయుదు. దానికి ముడియొకయంగుళము పొడవు మూడంగుళము లుండవలయును. ముడి దక్షిణావర్తముగా కూర్చను చివళ్ళు నాలుగంగుళము లుండవలయును.

## విష్టరలక్షణమ్.

శ్లో॥ నవకాశసమాయుక్త ముత్సేధం ద్వాదశాంగుళం । సవ్యమార్గేణఘటితగ్రంథి ర్వ్యోమాంగులోభవేత్ ॥

తా॥ 12 అంగుళాయామమును సవ్యమార్గముగా నిర్మింపబడిన ముడియు నొక యంగుల ముండునట్లుగను నూతనముగ దెచ్చిన రెల్లుతో కట్టవలయును.

## కూర్చలక్షణమ్.

శ్లో॥ నవదర్భాన్వితంకూర్చ ముత్తమంచేతికీర్తితం । మధ్యమం సప్తసంఖ్యాక మధమం భూతసంయుతం ॥ దక్షిణావర్తకగ్రంథిః కూర్చాగ్రం చతురంగులం । గ్రంథిమూలాత్సమారభ్య రుద్రధర్మగ్రహాయతం ॥

తా॥ 9 దర్భలతో కట్టబడిన కూర్చ యుత్తమము. 7 దర్భలతోకట్టబడినకూర్చ మధ్యమము, 5 దర్భలతోకట్టబడిన కూర్చ అధమము. ముడి దక్షిణావర్తముగను కూర్చాగ్రములు 4 అంగుళములుండవలెను. దానిపొడవు పదకొండుగాని పదిగాని తొమ్మిదిగాని అంగుళములు ముడినద్ద నుండియుండవలెను.

## దర్భాణాం లక్షణమ్.

శ్లో॥ కుశాః కాశా యవా దూర్వా విశ్వామిత్రశ్చ బల్బజాః। గోధూమా వ్రీహయో మౌంజ్యా పుండరీకా స్తథా దశ॥

తా॥ కుశ, రెల్లు, యవ, గరికె, విశ్వామిత్రము, మొదగ, గోధూమము, వ్రీహి, మౌంజి, పుండరీకము అని పదివిధములగు దర్భలుకలవని విద్వాంసులుచెప్పిరి.

శ్లో॥ ఛిన్నాగ్రంతు తృణంప్రోక్త మవిచ్ఛిన్నంపవిత్రకం। కుశః ప్రాదేశమాత్రస్స్యా ద్దర్భ స్తద్ద్విగుణాన్వితః॥ బర్హిస్త్రిగుణోపేత స్తదూర్ధ్వంతృణముచ్యతే॥

తా॥ అగ్రములు ఛిన్నమైనయెడల గడ్డి అని చెప్పబడును. కాబట్టి అగ్రములు ఛినకాకుండా నుండినయెడల పవిత్రమైనవని చెప్పఁబడెను. జానెడుపొడవుగలవి కుశ లనియు దానికి రెట్టింపుగనుందునవి దర్భలనియు మూడుజానలుండునవి బర్హిస్సు అనియు చెప్పబడును. అంతకుప్రమాణము నతిక్రమించియున్నవి గడ్డితోసమానము.

శ్లో॥ స్త్రీపుంనపుంసకాశ్చేతి కుశభేదాస్త్రిధాస్మృతాః। మృదుశ్యామాచజాయేతి జాయాకర్మసుయోజయేత్॥ ఈషత్పక్షసమాయుక్తాః పుందర్భాశ్చేతికీర్తితాః। పుంస్క్రియాయాంతుపుంలింగా యోజయేత్ సుధీజనః॥ నపుంసకకుశాశ్చేతి స్మృతాఃకోమలవర్జితాః॥

తా॥ స్త్రీదర్భలనియు పురుషదర్భలనియు నపుంసకదర్భలనియు మూడువిధములుగ జెప్పబడినవి. మృదువుగను నల్లగను నున్నవి స్త్రీదర్భలు అవి స్త్రీ ప్రధాన కార్యములకు నుపయోగింపవలయును. కొంచెము పక్షములుకలవి పురుషదర్భలు. అవి పురుషప్రధానమైన క్రియలకు నుపయోగింపవలయును. మృదువుగనుండనిదర్భలు నపుంసకదర్భలు.

శ్లో॥ మూలస్థూలా భవేన్నారీ చాగ్రస్థూలం నపుంసకం। మూలమగ్రంసమంచేతి పుర్మాదర్భస్యలక్షణం॥ విచ్ఛిన్నాగ్రాశ్చ భిన్నాగ్రా స్త్యాజ్యా హ్యాస్సర్వకర్మసు॥

తా॥ మఱియు మొదలు లావుగనున్నవి స్త్రీదర్భలనియు చివర లావుగనున్నవి నపుంసకదర్భలనియు మొదలు చివర సమానలావుగనున్నవి పురుషదర్భలనియు మరి

కొందరు చెప్పిరి. చివళ్ళు తునిగిపోయినవియు చీల్చబడినవియు నేకర్ణలయందు నుపయోగింపఁకూడదు.

## సమిల్లక్షణమ్.

శ్లో॥ వస్వంగులసమాయామా కనిష్ఠాంగులినాహకా। పాదేన పాదసంయుక్తా చాగ్రేణాగ్రసమాయుతా॥ అవక్రాచావ్రణాస్నిగ్ధా శుష్కా చైవశుభప్రదా॥సమిధాంలక్షణంప్రోక్త మేవమిధ్మస్యలక్షణం॥

తా॥ సమిధలు యెనిమిదంగులములు పొడవుండవలెను. ఆయంగులపరిమాణము చిటికెనవ్రేలి సంబంధమైనదిగాని అనామికవ్రేలి సంబంధమైనదిగాని పరిమాణము చెప్ప బడినది. ఆసమిధలనుంచునపుడు మొదలుతో మొదలును అగ్రముతో నగ్రమును కలుసుకొనునట్లు యుంచవలయును. మఱియు వంకరలేనివియు ముడులులేనివియు మృదువుగానున్నవియు ఎండినవియు నుపయోగించవలయును. ఇట్లు సమిధలలక్షణము చెప్పబడినది. ఇధ్మమునకు నుపయోగించెడి సమిధలుకూడ యిట్టి లక్షణము కలవియే యుండవలెను.

## పరిధిలక్షణమ్.

శ్లో॥ ఆయామఃపరిధీనాంచ ద్వాదశాంగుళ ఈరితః। మధ్యాం గులపరీణాహ స్త్వవక్రోనిర్వ్రణస్సమః॥

తా॥ పరిధులకు పండ్రెండంగులములు పొడవుండవలయును ఆయంగులప్రమాణము నడిమివ్రేలిసంబంధమైనది. మఱియు వంకరలేనివియు ముడులులేనివియు సమానముగానుండునవియు పరిధికిని యుపయోగింపవలయును.

## హోమద్రవ్యప్రమాణమ్.

శ్లో॥ కర్షప్రమాణమాజ్యంస్యా న్మధుక్షీరంచతత్సమం। తండు లానాంశుక్తిమాత్రం పాయసంప్రస్సృతైస్సమం॥

తా॥ ఇరువదిచిన్నములయెత్తుగల ఆజ్యము ఒక్కొక్కపర్యాయము హోమము చేయునపుడు ఉంచుచుండవలయును. అనఁగా నవరసుయెత్తుగలది, తేనెతోటి పాల తోటి హోమముజేయునపుడును అదేప్రమాణముగనే యుంచవలయును. బియ్యము హోమముజేయునపుడు ముత్యపుచిప్ప పట్టినన్ని బియ్యము హోమముజేయవలెను. పాయసము హోమముజేయునపుడు చారెడుప్రమాణముగ హోమముజేయవలయును.

శ్లో॥ కర్షమాత్రాణిభక్ష్యాణి లాజాముష్టిమితానిచ। అన్నం గ్రాససమంగ్రాహ్యం శాకం గ్రాసార్ధమాత్రకం॥

తా॥ భక్ష్యములను హోమముజేయునపుడు కర్షప్రమాణము. పేలాలను పిడికెడు ప్రమాణముగా నుంచవలయును. అన్నమును హోమముజేయునపుడు ఒక్కొక్క ముద్దచొప్పున హోమము జేయవలయును. కూరలను హోమముజేయునపుడు ఒక ముద్దలోసగము ప్రమాణముగా నుంచవలయును.

శ్లో॥ మూలానాంతు త్రిభాగంస్యా త్కందానామష్టమోంశకః। ఇక్షుఃపర్వప్రమాణంస్యా దంగులద్వితయంలతా॥

తా॥ వేళ్ళ హోమముజేయునప్పుడు మూడవవంతుగాను దుంపలను హోమముజేయునపుడు యెనిమిదవవంతుగాను చెరకును హోమముజేయునపుడు కణుపుకణుపు నడుమగానుండు ప్రమాణముగను తీగెలను రెండంగుళముల ప్రమాణముగను హోమముజేయవలయును.

శ్లో॥ వ్రీహయోముష్టిమానాస్స్యు ర్ముద్గామాషాయవాస్తథా। లవణం శుక్తిమాత్రంచ మరీచా ఏకవింశతిః॥

తా॥ వ్రీహులు పెసలు మినుములు యవలు హోమముజేయునపుడు పిడికెడు ప్రమాణముగనే యుంచవలయును. ఉప్పు ముత్యపుచిప్పపట్టినంత యుంచవలయును. మిరియములు ఒక్కొక్కపర్యాయమునకు ఇరువదియొక్కటి చొప్పున యుంచుచుండవలయును.

శ్లో॥ ఏకంస్యా త్పత్రపుష్పంచ తథా పాకాదికల్పయేత్। మాతులుంగం చతుఃఖండం పనసందశధాకృతం॥

తా॥ ఆకులను పుష్పములను హోమముజేయునపుడు ఒక్కొక్కటిచొప్పున యుంచవలయును. మరియు నితరములగు వస్తువులను ఆదేప్రకారముగా నుంచవలయును. మాదీఫలమును కాయిలో నాల్గవవంతుగాను పనసఫలమును పదియవవంతుగాను హోమముజేయవలెను.

శ్లో॥ అష్టధానారికేళంచ చతుర్ధాకదళీఫలం। త్రిధాకృతం ఫలంబైల్వం కపిత్థంఖండితంద్విధా॥

తా॥ కొబ్బరికాయను హోమముజేయునపుడు యెనిమిదవవంతుగను అరటిపండును నాల్గవవంతుగను మారేడుకాయను మూడవవంతుగను వెలగపండును సగముసగముగను హోమముచేయవలయును.

శ్లో॥ తిలసక్తుకణాదీనాం మృగీముద్రపరిమాణతః। చంద్రశ్రీఖండకస్తూరీ కుంకుమాగరుకర్దమాః॥ హరిమంథసమాః ప్రోక్తా గుగ్గులుర్బదరోపమః॥

తా॥ నువ్వులు పిండి కణములు హోమమును జేయునపుడు లేడిశరీరమునందుండు ముత్సప్రమాణముగ నుంచవలయును. కర్పూరము మంచిగంధము కస్తూరి కుంకుమము అగరు మొదలగునవి శనగగింజంత పరిమాణముగ నుంచవలయును. గుగ్గిలము రేగుపండంత ప్రమాణముగ నుంచవలయును.

శ్లో॥ ప్రాదేశమాత్రాస్సమిధః క్రోదరిహోముష్టిసంమితాః। యేషాం కేషాంచిదన్యేషాం దర్వ్యాణామప్యసంభవే॥ సర్వత్రాజ్యముపాదేయ మేవంజ్ఞాత్వాసుధీర్హవేత్॥

తా॥ సమిధలు ప్రాదేశమాత్రముగ నుండవలయును. అన్న హోమము జేయునపుడు పిడికెడు చొప్పున యుంచవలయును. ఇట్లు ఆయా వస్తువులు వాటికి చెప్పిన ప్రమాణము చొప్పున హోమమును జేయవలయును. ఈచెప్పబడిన వస్తువులలో నేవస్తువు దొరకకపోయినను దానికిగాను నెయ్యితోనే హోమము జేయవలయును.

## స్రుక్స్రువలక్షణమ్.

శ్లో॥ స్రుక్స్రువౌఖదిరేణైవ శమ్యావైకంకతేనవా। అథవా యాజ్ఞికైర్వృక్షైః కర్తవ్యాలక్షణాన్వితౌ॥

తా॥ స్రుక్కుస్రువము చంద్రతోగాని జమ్మితోగాని లేక యజ్ఞమునకు నుపయోగింపబడెడి యేవృక్షములతోనైనను సలక్షణముగ జేయవలెను.

శ్లో॥ సంగృహ్య మధ్యసారంతు ద్విధాకృత్వా తరుంపునః। తత్పార్శ్వేబిలమాఖ్యాత మవక్రంనిర్వ్రణందృఢం॥

తా॥ వంకరలేనిదియు ముడులులేనిదియు దృఢమైనచెట్టును తెచ్చి రెండుభాగములుగకోసి చేవగలిగియుండెడి మధ్యప్రదేశమును తీసికొని పార్శ్వమందు బిలముంచవలయును.

శ్లో॥ ద్వాత్రింశదంగులాయామ స్సప్తాంగుల సువిస్తృతం। తద్ఘనంతుచతుర్మాత్రమేవంపాదంచతత్రవై॥

తా॥ ముప్పదిరెండంగుళములు పొడవును యేడంగుళములు వైశాల్యము నాలుగంగుళములు ఎత్తును ఇట్లు పీఠముగా చేయవలయును.

శ్లో॥ మధ్యేసూత్రం ప్రసార్యాదౌ ముఖాయామం షడంగుళం। అగ్రభాగం త్రిభాగైకం ముఖవిస్తారముచ్యతే॥

తా॥ నడుమను సూత్రమును పట్టి ముఖప్రదేశమును ఆరంగుళము లుండునట్లును దానిలో మూడవవంతు అగ్రభాగమందు ముఖముయొక్క వైశాల్యముండునట్లుగను చేయవలయును.

శ్లో॥ యవత్రయపరిమాణేన పట్టికాముఖపార్శ్వయోః। యవమానేననిమ్నంస్యా న్ముఖంసర్వమశేషకం॥

తా॥ మూడుయవలు ప్రమాణముగ ముఖప్రదేశముయొక్క రెండుప్రక్కలను పట్టిక నేర్పరచవలయును. ముఖభాగమునందంతటను యవప్రమాణముగ లోతుగా నుండవలయును.

శ్లో॥ పఞ్చాంగులంగళాయామో విస్తారస్తుశరాంగులః। సప్తాంగులాయతావేదీ విస్తారస్తత్సమోభవేత్॥

తా॥ పదిహేను అంగులములు పొడవును అయిదంగులములు వైశాల్యము గళప్రదేశమునసుండవలయును. అందులో ఏడంగులముల ఆయామము ఏడంగులముల వైశాల్యముండునట్లు వేదిక నొకటి యేర్పరచవలయును.

శ్లో॥ బిలంసువృత్తంమధ్యేతు చాంగులద్వయమానతః। తద్విస్తారసమంగర్తం సువృత్తంబిలముచ్యతే॥

తా॥ దానిలో మధ్యభాగమందు రెండంగులములాయామముగలిగి అంతియే లోతుగా నుండెడి గుండ్రనిబిలమొకటి యేర్పరచవలయును.

శ్లో॥ పట్టికాబిలబాహ్యేతు యవమాన ఘనాన్వితం। తద్బాహ్యేష్టదళపత్రం యవనిమ్నంవిచిత్రితం॥

తా॥ బిలముయొక్క వెలుపల యవప్రమాణ మెత్తుగానుండునట్లు పలకగా నుండవలయును దానికి వెలుపల అష్టదళములు గలదియు యవప్రమాణము లోతుగా నుండు పత్రమును నిర్మించవలెను.

శ్లో॥ వేదికాయామస్తుపరితః పట్టికాత్రియవాఘనః। బిలాదూర్ధ్వముఖాత్త్రాత్వా కనిష్ఠాంగులమానతః॥ తారేణవాధతామ్రేణ నాళంప్రత్వాతుయోజయేత్॥

తా॥ బిలమునకు ఊర్ధ్వభాగమందు చిటికెనవ్రేలు ప్రమాణముపొడుగుగా గొయ్యిగా చెక్కవలయును. వేదికయొక్క చుట్టును మూడుయవలు ప్రమాణమెత్తుగానట్లు పలకనిర్మించవలెను వెండితోగాని రాగితోగాని యొకతీగెను చేయించి బిలముయొక్క ముఖభాగమున చుట్టించవలెను.

శ్లో॥ పక్షాంగుళప్రమాణేన పద్మాకారంతుగండికా। గండిక్యై కాంగులావృత్తా తన్నాహశ్చాబ్ధిమాత్రకః॥

తా॥ రెండంగులముల ప్రమాణముగ పద్మాకారముగను రచింపవలెను. దానికి నొకసందు నొక యంగులప్రమాణముగ గుండ్రనగా నుండవలయును. దానిలో నాల్గవవంతు బొడ్డుయుండునట్లుగ నిర్మించవలెను.

శ్లో॥ రవ్యంగులస్తు దండోచ్చ స్తస్యార్ధో నాహాముచ్యతే। తన్మూలే కలశాగార మంగులద్వయమానతః॥

తా॥ ఆరంగులములు దండాయామము దానిలోసగము నాహముండవలయును. దానికి మొదటిప్రదేశమున రెండంగులముల ప్రమాణముగా కలశాకారమేర్పరచవలెను.

శ్లో॥ ధర్మాంగులస్తునాహస్యా త్తస్యాధస్తాచ్చపాదయుక్। వేదికాయా స్త్వధఃపద్మం పృష్ఠాకారం సకర్ణికం॥ గజోష్ట్రపృష్టసదృశమాస్యంపృష్ఠాకృతింభవేత్॥

తా॥ ఆనాహము తొమ్మిదంగులముల ప్రమాణమును దిగువభాగమున పాదాకారముగ నుండవలయును. వేదికయొక్క దిగువభాగమందు పృష్ఠాకారముగ కర్ణికతోగూడి యున్నట్టి పద్మమును నిర్మించవలెను. ఏనుగుయొక్క ముఖసదృశమగు ముఖము లొట్టిపిట్టయొక్క వీపుతో సమానమగు పృష్ఠము రచింపవలయును.

శ్లో॥ ఏవంసంగ్రాహ్యతచ్ఛేషం పరిత్యజ్యాదృఢంయథా। ఏవం సృగ్లక్షణం ప్రోక్తం స్రువలక్షణముచ్యతే॥

తా॥ ఈప్రకారము చెప్పినట్లు యథావిధిగా చేయవలయును మిగిలినభాగము విడువవలయును. ఇట్లు స్రుక్కుయొక్క లక్షణమును జెప్పి యికముందు స్రువముయొక్క లక్షణమును చెప్పుచున్నాడు.

శ్లో॥ ద్వావింశదంగులాయామో దండనాహో రసాంగులః। మూలాద్గ్రీవాంతరంయావ త్త్ర్యంగులోగ్రీవనాహకః॥

తా॥ యిరువదిరెండంగులముల దండప్రమాణము దానికి చుట్టుకొలత ఆరంగుళములు. మొదటినుండి గళప్రదేశమువరకు నుండవలయును. గ్రీవముయొక్క చుట్టుకొలత మూడంగుళములు.

శ్లో॥ మూలవచ్చాగ్రినాహస్యా ద్వైబిలంనాసికాకృతి। బిలమానమధో వక్ష్యే కర్షార్ధేనపరిపూరితం ॥ పుష్కరాధఃపరికర్తవ్యా గండికాద్వియవోన్నతా॥

తా॥ మూలమునకు నుండునట్లుగనే అగ్రభాగమున చుట్టుకొలత యుండవలయును. దానికి నాసికాకారముగ రెండుబిలములుండవలయును. ఆబిలము ప్రమాణమెట్లనగా, కర్షములో సగభాగము నెయ్యి నిండియుండునంత ప్రమాణముగనుండవలెను దిగువప్రదేశమున పద్మాకారము రెండుయవలు యెత్తుగ నుండు ప్రమాణమున పలకగాను చెక్కవలెను.

మఖాగారే కలశస్థాపన స్థాననిర్ణయః.

శ్లో॥ పూర్వద్వారోత్తరేకుంభే నందీశాన్తిద్వికుంభయోః। కుంభత్రయేషు తద్యామ్యే శక్రంకాళంరవింయజేత్॥

తా॥ మఖాగారమంటపములో నేయేదిక్కున నెన్నికలశలుంచవలసినది యేయే దేవతల నావాహనజేయవలసినది జెప్పుచున్నాడు. తూర్పుద్వారమున నుత్తరభాగమందు రెండుకలశములుంచి నందీశ్వరుని శాంతిని ఆవాహనజేయవలయును. ఆద్వారమునకు దక్షిణభాగమందు మూడుకలశములుంచి యింద్రుని కాళిని సూర్యుని ఆవాహనజేయవలయును.

శ్లో॥ అగ్నించానలదిగ్భాగే కుంభే సమ్యక్పరిపూజయేత్। యామ్యస్య పూర్వదిగ్భాగే భృంగివిద్యే ద్వికుంభయోః॥ తత్పాశ్చాద్యమవిఘ్నేశౌ కుంభయుగ్మేసమర్చయేత్ ॥

తా॥ ఆగ్నేయదిక్కున నొక్క కలశముంచి యగ్నిహోత్రుని నావాహనము జేయవలయును. దక్షిణదిక్కునందు తూర్పుభాగములో రెండుకలశములుంచి భృంగిని విద్యను ఆవాహనము చేయవలెను. పడమటభాగమున రెండుకలశములుంచి యముని విఘ్నేశ్వరుని ఆవాహన జేయవలయును.

శ్లో॥ త్రిషుకుంభేషునైరుత్యాం విధికోణపకేశవాన్। ప్రతీచ్యాన్దక్షిణేభాగే వృషభంచనివృత్తికం॥ తస్యోత్తరత్రికుంభేషు స్కందోమావరుణాన్యజేత్ ॥

తా॥ నైరుతిదిక్కున మూడుకలశములనుంచి బ్రహ్మను నైరుతిని విష్ణువి ఆవాహనజేయవలెను. పడమటదిక్కునందు దక్షిణవైపున రెండుకలశములుంచి వృషభమును నివృత్తిని వాటికిను త్తరభాగమందు మూడుకలశములుంచి కుమారస్వామి పార్వతి వరుణదేవతల నావాహనజేయవలయును.

శ్లో॥ వాయవ్యాం వాయువిఘ్నేశౌ కుంభయుగ్మే ప్రపూజయేత్ । ఉదీచ్యాః పశ్చిమేభాగే కుంభయుగ్మే యజేత్సుధీః ॥ గౌరీం ప్రతిష్ఠాం తత్పూర్వే కుంభయోశ్శశిచండకౌ ॥

తా॥ వాయవ్యదిక్కున రెండుకలశములుంచి వాయుదేవుని విఘ్నేశ్వరుని ఉత్తరదిక్కున పడమటిభాగములో రెండుకలశములుంచి గౌరీదేవిని ప్రతిష్ఠను వాటికి తూర్పుభాగమందు రెండుకలశములుంచి చంద్రుని చండీశ్వరుని ఆవాహనజేయవలెను.

శ్లో॥ ఐశాన్యేత్రిషుకుంభేషు గురుమీశంవిధింయజేత్ । వాస్తుపంనిర్ఋతింవిష్ణుం ద్విపదేతు ప్రపూజయేత్ ॥ తథాచవరుణస్కందౌ శ్రియంచద్విపదేయజేత్ । గురుమీశంవిధించైవ ద్విపదేతు ప్రపూజయేత్ ॥ అన్యేషాం సర్వదేవానాం తత్తత్ స్థానేషు పూజయేత్ ॥

తా॥ ఈశాన్యదిక్కున మూడుకలశములుంచి బృహస్పతిని ఈశానుని బ్రహ్మను ఆవాహన చేయవలయు. వాస్తుపురుషుని నిర్ఋతిని విష్ణుని రెండుస్థానములయందును వరుణుని కుమారస్వామిని లక్ష్మిని రెండుస్థానములయందును గురువుని ఈశానుని బ్రహ్మను రెండుస్థానములయందును యితరములగు దేవతలందరిని ఆయాస్థానములయందు నావాహనజేసి పూజింపవలయును.

అవశిష్టయాగోపయుక్తార్ఘ్యపాద్యాది పాత్రలక్షణాని శైవాగమసారే ద్రష్టవ్యం ॥

తా॥ ఈ చెప్పబడిన వస్తువులకంటె మిగిలిన యజ్ఞమునకు నుపయోగింపబడునట్టి అర్ఘ్యపాద్యాది పాత్రలయొక్క లక్షణములు శైవాగమసారమనెడి గ్రంథమునందు జూచిన తెలియబడును.

అవ॥ అష్టమంగళదశాయుధ శిబికాన్యం దనాది లక్షణాని తథాగ్నిభేద జిహ్వాభేదాది సర్వలక్షణానిచ శైవాగమసారోత్తరభాగ ప్రతిష్ఠాంగపటలే ద్రష్టవ్యం ॥

తా॥ అష్టమంగళములు, దశాయుధములు, సవారిరథము మొదలగువాని లక్షణములు అగ్నిహోత్రభేదములు అగ్నిజిహ్వాభేదములు మొదలగు సమస్తవిషయములు శైవాగమసారమనే గ్రంథములో నుత్తరభాగమందు చెప్పఁబడిన ప్రతిష్ఠావిషయాధ్యాయములో చూచిన తెలియబడును.

## ఉత్సవాంగ ప్రాయశ్చిత్తవిధిః

శ్లో॥ అతఃపరంమహాసేన ప్రాయశ్చిత్తంతుచోత్సవే। పూర్వముత్సవకర్మార్థ మర్పితేష్వంకురేష్వను॥ తిర్యగ్గతేషురక్తేషు స్పృష్టేష్వధికృతైర్వినా। మూషికాద్యైశ్ఛదష్టేషు పంచార్ణమయుతం జపేత్ ॥

తా॥ ఓషణ్ముఖస్వామీ! ఇకముందు నుత్సవమునిమిత్తము చేయబడుచుండు క్రియలలో నేదైనను లోపము సంభవించినయెడల వాటికి జేయవలసిన ప్రాయశ్చిత్తములను జెప్పుచున్నానని యీశ్వరుఁడు చెప్పుచున్నాఁడు. అదియెట్లనఁగా ఉత్సవముజేయుటకు ముందు నంకురార్పణ చేయుదురుగాన ఆమొలవేసిన యంకురములు అడ్డముగా మొలచినను యెఱ్ఱనివిగానుండినను ముట్టుకొనతగనివారు ముట్టుకొనినను యెలుకలు మొదలగు వానిచే కొరకబడినను పదివేలు పంచార్ణమంత్రమును జరిపించవలయును.

శ్లో॥ పునఃపత్రిత్వాంకురారోపం జుహుయా దస్త్రమంత్రితః। పాలికాదావచతాత్రిక వల్మీకాదిసముద్భవే॥ పరిత్యక్త్వాన్యపాత్రేషు బీజావాపం సమాచరేత్ । శాన్తిహోమం ప్రకుర్వీత తద్దోషస్యాపనుత్తయే ॥

తా॥ అస్త్రమంత్రముతో హోమముజేసి తిరిగి అంకురార్పణము జేయవలయును. పాలికలయందు పక్కగూడుగులు పుట్టలు మొదలగునవి ఉద్భవించినయెడల ఆదోషపరిహారముకొఱకు శాంతిహోమముజేసి ఆపాత్రలను విసర్జించి వేరొకపాత్రలయందు తిరిగి అంకురార్పణ జేయవలెను.

శ్లో॥ పాత్రాణాంపాలికాదీనాం లక్షణాదివిహీనకే। జపేచ్ఛివగాయత్రీ మష్టోత్తరశతంగురుః॥

తా॥ పాలికలు మొదలగువానికి లక్షణములు శాస్త్రప్రకారము లేనియెడల ఆచార్యుడు నూటయెనిమిదిపర్యాయము శివగాయత్రీమంత్రమును జపింపవలయును.

శ్లో॥ కరస్థే దేశికాదీనాం నష్టే కౌతుకసూత్రకే। పునస్సాంత్యంతరం బధ్వా శివాస్త్రేణ శతం హువేత్ ॥

తా॥ మంగళసూత్రము ఆచార్యుడు మొదలగువారు యెవరి చేతులయందైన నుండుకొనఁగా, భ్రమప్రమాదములచే జారిపడిపోయిన యెడల నూరుపర్యాయములు శివాస్త్రమంత్రముచే హోమముజేసి తిరిగి మరియొక మంగళసూత్రమును చేయించి కట్టవలయును.

శ్లో॥ మహోత్సవాద్యుత్సవేషు బద్ధే ప్రతిసరే గురౌ। మూర్తిపే చ తథా భూతే మధ్యేప్యాశౌచసంభవే॥ కర్మానంతరమాశౌచం మాశౌచం శావం వా సూతకం తు వా। శావశ్య సంభవే స్నానం కర్మమధ్యే సమాచరేత్ ॥

తా॥ ఉత్సవములు మొదలగునవి జేయునపుడు ఆచార్యుఁడు కంకణముకట్టుకొని కార్యతంత్రము నడుపుచుండగా అస్పృశ్యతగలిగినను ఆశౌచము సంభవించినను కర్మానంతరమే యాశౌచము పట్టవలయుననిరి. మఱియు కర్మమధ్యను శావాశౌచము వచ్చినప్పుడు స్నానము చేయవలయునని చెప్పిరి.

శ్లో॥ కర్మమధ్యేపి వాశౌచం భవేదాత్మన్వితే స్మృతే। లబ్ధ్వా గురోరభ్యనుజ్ఞాం తదాన్యో దేశికోత్తమః॥ దేవం సంస్నాప్య శాంత్యర్థం జుహుయాన్మూలవిద్యయా। తతస్సమాపయేత్కర్మ శేషం శ్రద్ధా సమన్వితః ॥

తా॥ కర్మను జేయించుచుండగా నొకానొక ఋత్విక్కునకు ఆశౌచము తన కుటుంబసంబంధమైనది వచ్చినయెడల మరియొక యాజ్ఞికుని నియమించి వానివల్ల ననుజ్ఞ తీసుకొని వెళ్ళవలయును. అనంతరము నియమింపబడిన యాజ్ఞికుడు శ్రద్ధతో కూడినవాడై శాంతికొరకు మూలమంత్రముతో హోమము జేసి మిగిలినన కర్మనంతయు పూర్తి చేయవలయునని చెప్పిరి.

శ్లో॥ దండయష్టౌ పటే రజ్జ్వౌ ప్రమాణరహితే యది। జుహుయాద్వృషగాయత్ర్యా చాష్టోత్తరశతాహుతీః ॥

తా॥ ధ్వజమునకు కట్టెడి దండము పటము త్రాడు మొదలగునవి వాటివాటికి చెప్పఁబడిన ప్రమాణముగా లేనియెడల వృషభగాయత్రీమంత్రముతో నూటయెనిమిది పర్యాయములు హోమము చేయవలయును.

శ్లో॥ ఛిన్నేభిన్నేఽగ్నినాదగ్ధే శాంతిహోమంసమాచరేత్ । ప్రాగ్వదన్యంసమారోప్యం సహస్రంప్రజపేన్మనుం ॥

తా॥ మరియు దండము పటము త్రాడు మొదలగునవి తెగిపోయినను బ్రద్దలయినను అగ్నిచే తగలబడినను శాంతిహోమముజేసి తిరిగి పూర్వమువలెనే నూతనమగు వేరొకదానిని నారోపణజేసి మూలమంత్రమును వేయిపర్యాయములు జపింపవలెను.

శ్లో॥ మూర్తిహోమం ప్రకుర్వీత భేరీతాడనలోపనే । పునస్తత్తాడనంకుర్యా ద్రుద్రాధ్యాయం జపేద్గురుః ॥

తా॥ భేరీవాయించుట మరచిపోయినయెడల విగ్రహమునుగురించి హోమము జేసి యాచార్యుఁడు రుద్రాధ్యాయమును జపింపవలయును.

శ్లో॥ ద్వారావరణరథ్యాసు బలిదానవిహీనకే । శాంతిహోమం ప్రకుర్వీత బలిదానం పునశ్చరేత్ ॥

తా॥ ద్వారము అవరణవీధులు వీటియందు బలిప్రదానముచేయనియెడల శాంతిహోమమును జేసి తిరిగి బలిప్రదానము చేయవలయును.

శ్లో॥ యాగగేహస్య దేవస్య పూజాలోపే ప్రమాదతః । శాంతిహోమపురస్కంతు యజేద్ద్విగుణవస్తుభిః ॥

తా॥ యజ్ఞశాలకు దేవాలయమునకు పూజాలోపము కలిగినయెడల శాంతిహోమముజేసి పూర్వముజేయుచుండెడి వస్తువులకంటె రెండురెట్లు వస్తువులతోటి పూజ జేయవలయును.

శ్లో॥ ప్రమాదాదుత్సవాగ్నేస్తు నాశేజాతే శిఖిధ్వజ । అగ్నింపునఃప్రతిష్ఠాప్య శివమావాహ్యపూర్వవత్ ॥ శాంతిహోమం మూర్తిహోమం కుర్యాద్బ్రాహ్మణభోజనం ॥

తా॥ ఉత్సవనిమిత్తము ప్రతిష్ఠింపఁబడిన అగ్నిహోత్రము ప్రమాదవశమున నశించినయెడల తిరిగి అగ్నిప్రతిష్ఠాపనజేసి పూర్వమువలెనే శివుని ఆవాహనచేసి శాంతిహోమము మూర్తిసమ్మతమగుహోమమును చేసి బ్రాహ్మణసమారాధన చేయవలయును.

శ్లో॥ ప్రతిరాత్రింబలిద్రవ్య వ్యత్యాసేఽస్త్రశతంజపేత్ । సంప్రాప్తమంజసాతస్మిన్ కాలేదద్యాద్బలింగురుః ॥

తా॥ బలిప్రదానము చేయునట్టి పదార్థము నిత్యము ఒక్కవిధముగానే యుండవలయును. లేక నిత్యము వస్తువులు మారుచుండినయెడల అస్త్రమంత్రమును నూరు

పర్యాయములు జపముచేయవలయును. మరియు నెంతవరకు పదార్థము సంభవించునో ఆపదార్థమునే సకాలములో నాచార్యుఁడు బలిప్రదానము చేయవలెను.

శ్లో॥ వాహనాద్వాపియానాద్వా బింబేతుపతితేయది। స్నప నంవిధివత్కుర్యా దష్టోత్తరశతైర్ఘటైః॥ తన్మార్గింయానమారోప్య పునరుత్సవమాచరేత్ ॥

తా॥ గజవాహనము మొదలగువానియందు గాని సవారియందుగాని విగ్రహము నుంచి యూరేగింపు జరుగుచుండగా విగ్రహము జారి క్రిందపడినయెడల నూటయెనిమిది ఘటముల నీళ్ళతో శాస్త్రప్రకారము స్నానముచేయించి తిరిగి యావిగ్రహమును వాహనమునందుంచి యూరేగింపు జరపవలెను.

శ్లో॥ దేవస్యోత్సవకాలేతు దీపస్యపతనేసతి। ఛత్రచామర పూర్వాణాం పతనేతుశతంజపేత్ ॥ అఘోరాస్త్రంతథావహ్నౌ దాహేచాష్టోత్తరంశతం ॥

తా॥ ఉత్సవసమయములో దీపము ఛత్రము చామరము మొదలగునవి రాలిపడి పోయినను అగ్నిహోత్రముచే దహింపబడినను అఘోరాస్త్రమంత్రము నూరుపర్యాయములు జపముచేయివలయును.

శ్లో॥ శివస్యోత్సవకాలేతు గ్రామేమరణసంభవే। తతోగ్రామంతుసంప్రోక్ష్య శాంతిహోమంసమాచరేత్ ॥

తా॥ శివునియుత్సవసమయములో గ్రామములో నెవనికైనను మరణము సంభవించినయెడల శవమును తీసికొనివెళ్ళి పిమ్మట గ్రామమునకు సంప్రోక్షణజేసి శాంతిహోమమును జేయవలయును.

శ్లో॥ తథాచోత్సవకాలేతు గ్రామంవావహ్నిదాహతః। దూషితేపంచగవ్యైస్తు ప్రోక్ష్యగ్రామాదికంగుహ॥ సమాచరేదుత్సవంచ దేవదేవస్యశూలినః। బలిదానంచకుర్వీత ద్విదినాదిదినంతువా॥

తా॥ దేవదేవుండగు శివుని యుత్సవసమయములో గ్రామము మొదలగునవి యేవి దహింపబడి చెడిపోయినను ఆచెడిపోయినవాటిని పంచగవ్యములతో సంప్రోక్షణజేసి రెండుదినములనుంచి జరుపుచుండెడి బలులనుగాని ఒకదినమునుండి జరుపుచుండెడి బలులనుగాని తిరిగి చేయవలయును.

శ్లో॥ భగవత్పార్వతీజానే రుత్సవేవిఘ్నితేసతి। తత్తద్దోషానుసారేణ ప్రాయశ్చిత్తపురస్సరం॥ అతిక్రాన్తోత్సవాత్కుర్యాద్బలిదానిచక్రమాత్ ॥

తా॥ భగవంతుడగు సాంబమూర్తియొక్క యుత్సవమునకు నప్పుడప్పుడు ఏవియైనను విఘ్నములు కలిగినప్పుడు ఆయావిఘ్నానుసారముగా కలిగిన దోషములకు శాంతినిమిత్తమై ఆయాప్రాయశ్చిత్తములనుజేసి గడచిన దినసంబంధమగు బలిప్రదానములను జేసి అతిక్రాంత దినసంబంధమైన యుత్సవములను చేయవలయును.

శ్లో॥ స్యందనస్యోత్సవేకాలే చక్రభేదేక్షభేదనే। రజ్జుచ్ఛేదేపివాహ్యాన్యం సంయోజ్యచయథాపురం॥ శాంతిహోమంతుయాత్రాంతే కుర్యాద్దోషాపనుత్తయే॥

తా॥ రథముయొక్క చక్రముగాని యిరుసుగాని రథమునకుకట్టిన త్రాడుగాని రథోత్సవముజేయుసమయములో భంగమైనయెడల మరియొకదానినిగూర్చి రథోత్సవముజేసి తిరిగి గుడివద్దకు వచ్చినపిమ్మట ఆదోషము పోవునిమిత్తము శాంతిహోమమును చేయవలయును.

శ్లో॥ రథాద్దేవస్యపతనే శిబికాయాంవృషేతువా। పునర్దేవంసమారోప్య నీత్వాతద్దేవమందిరం॥ పంచవింశతికుంభైశ్చ స్నపనంసమ్యగాచరేత్। సరథస్యసబింబస్య పతనేపూర్వవచ్చరేత్ ॥

తా॥ రథమునుండి స్వామివిగ్రహము పడిపోయినయెడల తిరిగి ఆవిగ్రహమును సవారిలోగాని వృషభవాహనమందుగాని యుంచి గుడివద్దకు తీసికొనివచ్చి యిరువదియైదు కడవల నీళ్ళతో యథావిధిగా స్నానముచేయించవలయును. విగ్రహసహితముగా రథము పడిపోయినను పూర్వమువలెనే చేయవలయును.

శ్లో॥ రథచక్రాదిఘాతైస్తు మనుష్యమరణేసతి। శవంబహిర్వినిష్కాస్య తద్భువంప్రోక్ష్యదేశికః॥ వాస్తుహోమంచస్నపనం కారయేదుక్తమార్గతః॥

తా॥ రథచక్రము మొదలగువానియొక్క దెబ్బలుతగిలి మనుష్యులెవరయినను మరణించినయెడల శవమును బయటికి తీసుకొనివెళ్ళి యాప్రదేశమందు ప్రోక్షణజేసి యాచార్యుఁడు శాస్త్రోక్తప్రకారముగా శాంతిహోమము సంప్రోక్షణాదులను జరిగించవలయును.

శ్లో॥ రథోత్సవస్యకాలేతు తద్గ్రామేయత్రకుత్రవా। విప్రాదీనాంచమరణే తచ్ఛవంగ్రామతోబహిః॥ నిష్క్రాన్త్యవాస్తువీథీస్తు పంచగవ్యేనమార్జయేత్। గ్రామప్రదక్షిణంనీత్వా యాత్రాంతేన్నపనంచరేత్॥

తా॥ రథోత్సవసమయములో నాగ్రామములో నెక్కడయినను బ్రాహ్మణులు మొదలగువారిలో నెవరుమరణించినను శవమును బయటకు తీసుకొని వెళ్ళినపిమ్మట నావీధులయందు వాస్తుమంత్రములతో పంచగవ్యములను ప్రోక్షించి గ్రామప్రదక్షిణముగా రథోత్సవము గావించి తిరిగి గుడివద్దకువచ్చి యథావిధిగా సంప్రోక్షణాదిక్రియలను గావించవలయును.

శ్లో॥ మృగయాత్రోత్సవేస్కంద తథాచూర్ణోత్సవేసతి। లుప్తే కుర్యాచ్ఛాంతిహోమం తత్తద్దోషాపనుత్తయే॥

తా॥ మృగయాయాత్రోత్సవము చూర్ణోత్సవము మొదలగువానికి లోపము కలిగినయెడల ఆయాదోషములు పోవునిమిత్తము శాంతిహోమమును జరిగించవలయును.

శ్లో॥ శాన్తిహోమంప్రకుర్యాచ్చ తీర్థకాలవిపర్యయే। తీర్థయాత్రాప్రకర్తవ్యా సూర్యస్యాస్తమయాత్పురా॥ పూర్వభాగేరజన్యాం వా కుర్యాచ్ఛాస్త్రోక్తమార్గతః॥

తా॥ తీర్థయాత్రాకాలమునకు విపరీతము కలిగినయెడల అనఁగా శాస్త్రసమ్మత కాలములో జరగనియెడల శాంతిహోమమును జేయవలయును. ఆకాలమెట్లగా సూర్యాస్తమయమునకు లోపుగాగాని లేక రాత్రిలో పూర్వయామమందుగాని శాస్త్రములో చెప్పినప్రకారము తీర్థయాత్రోత్సవము గావించవలయును.

శ్లో॥ కుంభప్రోక్షణలోపేతు జపేత్పంచాక్షరంశతం। ఆచార్యదక్షిణాహీనే నిష్ఫలస్యాత్తదుత్సవః॥ తచ్ఛాంత్యైశివసావిత్రీం ప్రజపేదయుతంగురుః। ప్రణమ్యదణ్డవద్భూమౌ యజమానఃప్రసన్నధీః॥ సంతోషంకారయేద్ధీమాన్ గురోర్హేమాంగులీయకైః। ద్విగుణాందక్షిణాందద్యాత్తేనశాన్తిర్భవిష్యతి॥

తా॥ అనంతర మాలయమునకు వచ్చినపిమ్మటకలశోదకములచే సంమార్జనచేయనియెడల నూరుపర్యాయములు పంచాక్షరీమంత్రమును జపించవలయును. ఉత్సవానంతర మాచార్యునకు దక్షిణ నివ్వకపోయినయెడల ఆయుత్సవము నిష్ఫలముగాన

ఆచార్యుఁడు తచ్ఛాంతికొఱకు శివగాయత్రీమంత్రమును పదివేలపర్యాయములు జపించు కొనవలయును. అటుపిమ్మట యజమానుఁడు పశ్చాత్తాపముతోఁగూడిన మనస్సుకల వాఁడై ఆచార్యునకు సాష్టాంగదండప్రణామము లాచరించి ప్రార్థించి బంగారుకంక ణము లుంగరములు రెట్టింపుగా దక్షిణలు మొదలగునవి గురువునకు సమర్పించి సంతోష పెట్టినయెడల ఆదోషమునకు శాంతికలుగును.

శ్లో॥ ద్విజభోజనలోపేపి హ్యేవం శాన్తిం సమాచరేత్ ।
మహోత్సవాన్తరేవాస్తుం నకదాచిదతిక్రమేత్ ॥

తా॥ బ్రాహ్మణభోజనము లోపముజేసినను యీప్రకారముగానే శాంతిని జరుప వలయును. ఈయుత్సవముసమయములో నప్పుడప్పుడు చేయవలసిన వాస్తుపూజాది క్రియలను శాస్త్రోక్తకాలము నతిక్రమించకుండా జేయవలయును.

శ్లో॥ మృగయాయాం తీర్థమహే నదోషోవాన్త్వతిక్రమః ।
ఏతౌవినాబహిర్గచ్ఛే ద్యదిశాంతిం ప్రకల్పయేత్ ॥ పంచవింశతి కుం భైశ్చ స్నాపయే త్పరమేశ్వరం। తద్దోషశాన్తిర్భవతి సర్వం విధి వదాచరేత్ ॥

తా॥ మృగయాయాత్రోత్సవమందును తీర్థయాత్రోత్సవమందును వాస్తుపూజా మాది క్రియలను సకాలములో నతిక్రమించి జేసినప్పటికిని దోషములేదు. ఈ రెండు విషయములకంటె మిగిలినకార్యములయందు శాంతిని జరుపవలయును. అదియెట్లనగా ఇరువదియైదు కుంభముల జలముతో పరమేశ్వరుని స్నానముజేయించవలయును. ఈప్ర కారముజేసిన శాంతియగును. ఇట్లు శాస్త్రములో జెప్పినప్రకారము శాంతివిధులను యథావిధిగా జరిగింపవలయును.

## నారికేళలక్షణమ్ యోగజాగమే ఉత్తరభాగే.

శ్లో॥ అథవక్ష్యేసమాసేన నారికేళస్యలక్షణం ॥ నాతిస్థూలం నాతికృశం సుపక్వంసలిలాన్వితం ॥ నిర్వ్రకంవర్తులంశుద్ధం నిస్త్వక్ దుర్గంధవర్జితం। అభగ్నంచశిఖోపేత మవ్రణంనాతికోమలం ॥

తా॥ ఇకను సంక్షేపముగా కొబ్బరికాయయొక్క లక్షణమును జెప్పుచున్నాడు. ఎటువంటికాయ నుపయోగింపవలయుననఁగా, ఎక్కువలావుగాను మిక్కిలిచిన్నదిగా నుండకూడదు. బాగాపండినదియు, లోపలజలమున్నదియు, వంకరలేనిదియు, గుండ్ర

నగానున్నదియు, శుద్ధమైనదియు, దుర్వాసనలేనిదియు, బ్రద్దలుకానిదియు, జుట్టుతో గూడినదియు, బొడిపెలు లేనిదియు, మిక్కిలి లేతగానుండనిదియు, నున్నట్టి కాయను సంపాదించి స్వామినివేదన నుపయోగింపవలయును.

శ్లో॥ శిఖామూలేగృహీత్వాథ త్వాళయేదస్త్రవారిణా। దేవస్యాగ్నేయకోణస్థ పాషాణే తాడయేద్గురుః॥

తా॥ దానిని కొట్టుట యెట్లనగా, కొబ్బరికాయయొక్క జుట్టువుచ్చునని అస్త్ర మంత్రమును జదువుచు నీళ్ళతోకడిగి దేవునకు ఆగ్నేయభాగమందుండెడి రాతిమీద ఆచార్యుడు బ్రద్దలుకొట్టవలయును.

శ్లో॥ ప్రాదేశమాత్రముద్ధృత్య తాడయేన్నారికేళకం। ఏకేనైవప్రహారేణ ద్విధాదళనముత్తమం॥

తా॥ అదికొట్టుట యెట్లనగా, ఒకజానెడుమెత్తు పైగా యెత్తి కొట్టవలయును. ఒకదెబ్బకు రెండుచెక్కలుగ పగులుట యుత్తమము.

శ్లో॥ గుణాంశఊర్ధ్వభాగస్స్యాద్దధోభాగఃకరాంశకః। ఏవం చేద్ధనధాన్యాది సమృద్ధిరితికీర్తితా॥

తా॥ ఆచెక్కలు పగులుటలో కాయలో మూడవవంతు జుట్టుయున్నట్టి పైచెక్కలోను మిగిలిన రెండువంతులు అడుగుచెక్కలో నున్నట్లుగను పగిలినయెడల ధనధాన్యాద్యైశ్వర్యముల సంపత్తి కలుగుననిచెప్పిరి.

శ్లో॥ తాడితేనారికేళేతు బహూనిశకలానిచేత్। స్త్రీణాంచ పురుషాణాంచ కలహస్యాత్పరస్పరం॥

తా॥ కొబ్బరికాయను బ్రద్దలుకొట్టినప్పుడు అనేకముక్కలుగా పగిలినయెడల స్త్రీలకు పురుషులకు పరస్పరము కలహముసంభవించుననిరి.

శ్లో॥ విస్ఫోటనంశిఖాస్థానే కర్తృనాశోభవిష్యతి। సమభాగాయదితథా స్త్రీణాంగర్భోవినశ్యతి॥

తా॥ జుట్టుసమీపములో పగిలినయెడల కర్తకు హానికలుగును. రెండుచెక్కలు సమానముగా పగిలినయెడల భార్యకు గర్భము చెడిపోవుననిరి.

శ్లో॥ బహుధాస్ఫుటితేతస్మిన్ ధనధాన్యాదినాశనం। వక్రే సతిమహోత్పాతః దీర్ఘప్రహారణాద్భయం॥

తా॥ ఆకాయ అనేకచక్కలుగ బ్రద్దలైనయెడల ధనధాన్యాదినాశనము కలుగు ననిరి. వంకరగాపగిలిన దుర్భిక్షము, పొడవుగాపగిలిన భయముకలుగుననిరి.

శ్లో॥ జలహీనేవర్షహానిర్మహీమారీప్రకోపనం । దుర్గంధః కర్తృనాశస్యాత్ప్రజానాం రుగ్భయం భవేత్ ॥ తద్దోషశమనార్థంతు మూలమంత్రంశతంజపేత్ । పునశ్శుద్ధం ఫలంగ్రాహ్యం యథావిధి నివేదయేత్ ॥

తా॥ కాయలో నీళ్ళులేకపండినయెడల వర్షము కురియకపోవుట మారీస్ఫోటకాదులును సంభవించును. కొబ్బరి దుర్వాసనగనున్నయెడల కర్తకు హానియు ప్రజలకు రోగాదిభయములు కలుగును. కాబట్టి అటువంటి దోషములు పోవునిమిత్తము మూలమంత్రమును నూరుపర్యాయములు జపించి తిరిగి మంచికాయనుతెచ్చి బ్రద్దలు కొట్టి యథావిధిగ స్వామికి నివేదనచేయవలయునని చెప్పిరి.

శ్లో॥ నివేదనేజలంత్యాజ్య మభిషేకేఫలంతథా । ఏకస్మిన్నద్వయంగ్రాహ్యం దేశికేనసుభార్గిణా ॥ రాజ్ఞోరాష్ట్రస్యవృద్ధ్యర్థ మేవం కుర్యాద్గురుర్నవః ॥

తా॥ కాయను కొట్టినపిమ్మట నివేదన చేయునపుడు జలముండకూడదు. అభిషేకము జేయునపుడు ఫలముపయోగింపకూడదు. ఒక్కవిషయములో రెండుక్రియలను జేయకూడదని యున్నది కాబట్టి అభిషేకనిమిత్తము జలమును నివేదననిమిత్తము కొబ్బరి ప్రత్యేకప్రత్యేకముగానే యుపయోగింపవలయుననిరి.

ఇత్యుత్తరయోగజే నారికేళలక్షణంనామేకోనవింశతిపటలః ॥

## భూశుద్ధిక్రమః.

శ్లో॥ పృథ్వీత్వయాధృతాలోకా దేవత్వం విష్ణునాధృతా, త్వంచధారయ మాం దేవి పవిత్రం కురుశాసనమ్. అపసర్పంతు యేభూతాః యేభూతాభూమిసంస్థితాః, యేభూతావిఘ్నకర్తారో తేనశ్యంతి గుర్వాజ్ఞయా అపక్రామంతు భూతాద్యాస్సర్వేతాభూమిభారకాః, సర్వేషామవిరోధేన బ్రహ్మకర్మసమారభేత్.

తతః ప్రణవసహితాగ్ని బీజేన అస్త్రమంత్రేణ జలమభిమంత్ర్యభువం సంప్రోక్ష్య, మూలమంత్రముచ్చార్య, దివ్యదృష్ట్యా, విఘ్నానుచ్చార్య, అస్త్రమంత్రసహిత తాళత్రయంకృత్వా, దేవతాయాస్తుయా పూజాసా పూజాభవతామపి, తదభేదాత్తతస్సర్వేచాను

కూల్యంప్రయాతభోః, ఏవం సంప్రార్థ్య, అస్త్రమంత్రేణ అభిమంత్ర్య, జలేన ఆసనం సంప్రోక్ష్య. ఆసనమంత్రస్య మేరుపృష్ఠ ఋషిః సుతలంఛందః, శ్రీకూర్మో దేవతా, ఇష్టదేవతా మహామంత్రస్య ఆసనాయ ఆసనోపవేశనే వినియోగః, కూర్మయంత్రంలిఖిత్వా, నమస్కృత్య, ఓంహ్రీం ఆధారశక్త్యైనమః, కమలాసనాయనమః, అనంతాసనాయనమ, పద్మాసనాయనమః, కూర్మాసనాయనమః, ఓం గుం గురవేనమః, ఓం పం పరమే గురవేనమః, ఓం పరాపర గురవేనమః, ఇతి గురుం ధ్యాత్వా. సపరివారాయ ఇష్టదేవతాయ నమస్కృత్వా తదనంతరం ఓం దుం దుర్గాయైనమః, ఓం గం గణపతయేనమః, ఓం క్షుం క్షేత్రపాలకాయనమః, ఓం సం సరస్వత్యైనమః, ఆగ్నేయాది దిక్షుప్రణమ్యేతి. ఓం బ్రహ్మతేజసే ఈం ఇంద్రాయనమః, ఓం బ్రహ్మతేజసే రాం ఆగ్నేయాయనమః, ఓం బ్రహ్మతేజసే సాం యమాయనమః, ఓం బ్రహ్మతేజసే హాం నిర్ రుతయేనమః, ఓం బ్రహ్మతేజసే శాం వరుణాయనమః, ఓం బ్రహ్మతేజసే క్షాం వాయవేనమః, ఓం బ్రహ్మతేజసే రాం కుబేరాయనమః, ఓం బ్రహ్మతేజసే హాం ఈశానాయనమః, శం హం షం సం శం వం లం రం సంసర్గాగ్నిబీజేన అగ్నిప్రాకారం కల్పయేత్. ఇతి భూశుద్ధిక్రమః

పంచాక్షరధ్యానమ్.

శ్లో॥ ఓంకారం బిందుసంయుక్తం నిత్యంధాయన్తియోగినః। కామం మోక్షదంచైవ ఓంకారాయనమోనమః॥ నమంతిమునయో దివ్యా నమంత్యప్సరసాంగణాః। నరాణాంఆదిదేవానాం నకారాయ నమోనమః॥ మహాదేవం మహాత్మానం మహాజ్ఞాన పరాయణమ్। మహాపాపహరంనిత్యం మకారాయనమోనమః॥ శివంశాంతంజగన్నాథం లోకానుగ్రహకారణమ్। శివమేకపరందైవం శికారాయ నమోనమః॥ వాహనంవృషభారూఢం వాసుకికంఠభూషణం। వామే శక్తిధరందైవం వకారాయనమోనమః। యత్రయత్రస్థితశ్శంభు స్సర్వ వ్యాపీమహేశ్వరః। యోగురుఃసర్వదేవేశః యకారాయనమోనమః॥

సంపూర్ణము.